# కృష్ణవాత్సల్యసుధావిస్ఫూర్తి

[illegible]

## అను

# రసిక శర[illegible]తి

కవయిత్రీతిలక

**శ్రీమతి పి[illegible]ల శ్రీదేవమ్మ**

కృతిపోషకులు

జొన్నలగడ్డ వేంకటకృష్ణారావు

పొన్నూరు

**1976**

ప్రథమ ముద్రణము జూలై 1976

ప్రతులు 500 వెల [illegible]

ప్రాప్తిస్థానము

మహాకవి; చిత్రబంధకవి, సుధీమా

**శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు**

కలికివాయ (POST)

(వయా) సింగరాయకొండ

ప్రకాశం జిల్లా

భాషాప్రవీణ

**జొన్నలగడ్డ జానకిరామయ్య**

తెలుగు పండిట్

N R. & P.M.H School, Chirala



మూల్యం 2-50

కుబేరా ప్రింటర్సు చీరాల

భాషాప్రవీణ, మధురభారతి
చింతలపాటి నరసింహదీక్షిత శర్మ
సీనియర్ తెలుఁగు పండిట్
జిల్లా పరిషత్ హైస్కూలు అచ్చమ్మపేట, సత్తెనపల్లి తా।

శ్రీ రాజరాజేశ్వరీ దేవ్యైనమః

## — అభినందన చందనము।—

శ్రీ యుతుఁడు - శేముషీ శ్రీయుతుఁడు - మిత్ర శిరోమణి యునగు చొన్నలగడ్డ జానకీ రాముఁడు నాసహపాఠి తాను సరస సారస్వత రసాస్వాదనాలోలుఁడై సరస్వతీ వీచీ మాలికలదోఁగాడిన రసిక రాజమరాళమూర్ధామణి "కవిః కరోతి కావ్యాని రసంజానాతి పండితః" అన్నట్లు కవితారచనా దాక్ష్యము తగినంత లేకున్నను కవితానవతాశుచితా మహత్త్వను గూలంకషముగాగుర్తెఱింగినవిజ్ఞ శిఖావతంసుఁడు సహృదయ మూర్ధన్యుఁడు ఈ నా సుహృన్మణి తనయన్న గారి నొకకృతి పోషకతాసామ్రాజ్యమునకుఁ బట్టభద్రునిం జేయసంకల్పించి "విష్ణువాత్సల్య సుధావిప్రుషము అను రసిక శరణాగతి" అను సుకృతిని దయతోఁ బంపి నా యభిప్రాయముగోరినాఁడు

మా జానకీరాముని యుదారత, హృదయ మార్దవము భావుకత, భాతృభక్తి, వంశగౌరవ సమాకాంక్షోత్కలిక, నన్ను లరించినది. నిజముగా నా మిత్రుఁడు స్వార్థమును దవ్వుగ ద్రోపి పరార్థ ప్రసక్తుఁడై సౌజన్యమునకును, సాకల్యమునకును

కృతినిర్వాహణ దాక్షిణ్యమునకును నిదర్శనముగా నున్న
యాదర్శ మార్గదర్శి, సహృదయ ప్రశంసాధాముఁడగు మా
జానకీరాముని "నాస్తిధన్యస్త్వదన్యః" అని కొనియాడక
తప్పదు

ఇఁక శ్రీమంతుఁడు ధీమంతుడు శాంతస్వాంతుఁడునైన
"శ్రీ జొన్నలగడ్డ వేంకటకృష్ణసుధీమణి" కృతిపోషక గౌరవ పీఠ
మలంకరించుట వారి కుటుంబమునకొక యపూర్వ వైభవ కళా
తోరణము ఈ మహనీయుని సత్వసత్వ సమలంకృత హృదయ
వజ్ర సంకల్పమే యీ కృతి యక్షరాకృతి ధరించుటకు మూల
కారణమై యుండనోపు ఈ కృతి పోషకవరేణ్యునితో దాదాపు
ఇరువదియైదేండ్లనుండి నాకు పరిచయము భక్తిపూర్వకస్నేహము
గలదు. "శ్రీ వేంకటకృష్ణారావు" గారికి సముచితప్రజ్ఞ, దానిని
మించిన లోకజ్ఞానము, దానినధిగమించిన యార్ద్రభావము,
దానికి వన్నె గూర్చు బంధుమిత్ర సోదర వాత్సల్యము, దాని
నలంకరించు సౌశీల్యసంపద, దానికి మెఱుఁగుదిద్దు విద్యా వివేక
వినయగరిమ తోడవులై యున్నవనుట నిశ్చయము అప్యా
యముట్టిపడునట్లు పలుకనేర్చుట వీరికి వెన్నతోఁబెట్టిన విద్య
ఈ కుటుంబమునకు వీరి వాక్కు "శ్రీరామరక్ష" మాకును వారి
పలుకులు హృదయాహ్లాదము చిలకరించు కప్పురపుంబలుకులే
ఈ మహాశయుని యాన మావంటి పిన్నలకు, వారియింటి వారికి
సారతరమైన దివ్యోపదేశ పీఠము "అన్నదమ్ములనగా మ
వారలదే నిజమ్ముగా" నన్న వాక్కులీ సోదరులందు సార్థకము
లగుట సుకృత విశేషమున వచ్చును.

మిగిలినది కావ్యప్రశంస కృతిపతియు గ్రుక్క యూపక యే చదివితిని. ధారాశుద్ధి, శయ్యా సారస్యము, పదపుష్టి, రస సౌభాగ్యము తెలుఁగుపలుకుబడు లతీయందనమ్ములు, సంస్కృతోక్తి రుచులు జాలువారుచున్న "రసిక శరణాగతి" అబలా రచనాలాలితమయ్యుఁ గవికుల శిరోమణుల రచనలను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. అంతియకాదు ఇది యొక యానందనందన మందార ప్రసూన వితానపరీమళలహరీ సంప్లావిత మధుర సన్నివేశము. సరసహృదయ మనోహర్ష సముత్కర్ష భావనా భావ ప్రతిఫలన చకచ్చకిత నిర్మలాదర్శ దార్శనిక రత్నాదర్శ గుంభిత వాణీ సుమశయ్యా పరిష్కార సముల్లాస లీలానికేతన శృంగ పరిమత్సదపి రసధామము మీదు మిక్కిలి మదీయ నవోత్సాహదోహల మాకందఫల సారవాహినీ జనక స్థానము. ఈకృతి విష్ణువాత్సల్య సుధా విప్రుషమగుటచే విబుధాళికాశీష మనుటకుఁ దగియున్నది.

విష్ణువాత్సల్య సుధారస ధారాపూతపరమ భాగవత శిఖామణి కమనీయ గాథా విలసితదివ్య కావ్యమునకు శ్రీ పొన్నలగడ్డ వేంకట కృష్ణారావుగారు సుకృత సమలంకృతులై కృతిపోషకులై నందుకు మైత్రీ బాంధవములఁ బురస్కరించుకొని మనసా శ్లాఘించుచు, సత్సంకల్పము నెరవేర్చుకొను నా సహాధ్యాయుఁడు, ఇష్టుఁడు, మిత్ర వతంసుఁడునైన జానకీరాము నభినందించుచుఁ బరిమళము పెడని, వాడని యభినందన పద్య ప్రసూన రాజములను వ్రాసి పంపుచున్నాఁడను.

"జొన్నలగడ్డ వంశము" యశోరమకుంగుదురై లసత్కృతిన్
వన్నెలగడ్డయై సహానభావము పండిన పండ్ల తోటయై
చెన్నగు నన్నగమ్ముల విశిష్టతకెక్కిన వైజయంతియై
పొన్నతి మిన్నుదాకి కృతిపోషక భూషణమై మెఱుంగిడున్

సరసాంతఃకరణుండు "కృష్ణుఁడు" నవోత్సాహంబులుప్పొంగ సో
దరబృందమ్మునకున్ శిరోమణి సముత్కంఠన్ బుధానంద వి
స్ఫురితశ్రీఁ "గృతిపోషకుం"డగుచు మెచ్చుంగూర్చెఁదద్వంశసుం
దర కీర్తిందిర కింతకన్నఁగలదా తాత్పర్యమున్ స్థైర్యమున్

తతకీర్తిప్రదమత్కరాత్మకము సంతానమ్ము పోషించు ను
న్నతి నీకబ్బెను సంతు లేదను కొఱంతన్ మాని నీ స్వాంత మా
శ్రితమందార వసంతమై సుగుణ లక్ష్మీకాంత సీమంతమా
నతమున్ "వేంకట కృష్ణ"! సజ్జన వతంసా! భూసురాగ్రేసరా!

ఆచార్యత్వము గొన్న శేషబుధు నిల్లాలై, కవితోన్నతిన్
వాచామాధురి చిందు ప్రోడయయి, సొంపుల్ పెంపులూరించు స
ద్వాచా శేవధియై సతీతిలకమై భాసిల్లు "శ్రీదేవి" ప్ర
జ్ఞా చాతుర్యము సర్వసత్కవి సమర్చాగౌరవ స్థానమౌ

శ్రీదేవీ రచితమ్ము సత్కృతి సుధావృష్టింబ్రవర్షించి స
మ్మోదమ్మున్ ఘటియించుటబ్బురమె? యాపుష్పేషుసద్వల్లకీ
నాదమ్ముల్ హరిభక్తనూపుర వినూత్నధ్యానముల్ నవ్య మ
ర్యాదా సిద్ధరసప్రపంచపరమార్థశ్రీల రంజిల్లఁగన్

తౌల్యమునందుఁజిక్కు నవలానవలాలితమాల్యమచ్ఛని
శ్రైష్ఠ్యముగానొనర్చి మధురమ్మగుభక్తి నిజోక్తి, విష్ణువా
త్సల్యసుగాంతరంగములసారముగ్రోలి పరమ్మగొన్న "సా
శీల్యపదఃగగణ్యకథ" చిత్తము మొత్తము మత్తుఁగొల్పెడిన్
రసమాశ్రయంగ సుసంగతమ్ము, కృతియా రాజీవపత్రాక్షు భ
క్తి సద్యోజాత మధుస్రవంతి, కృతికర్తృత్వ ప్రథాపీఠి ధ
న్య సతీపావనలేఖనీ మృదురవానందపరిపూతమ్ము, వి
జ్ఞ సమాజాగ్రణి పోషకుండు, రసికాకల్పమ్ముగా కల్పమే?
ఇది "శ్రీ జొన్నలగడ్డ వంశ సుషమాహేవాక లీలాధ్వజం,
బిదిమా "వేంకట కృష్ణ" విజ్ఞుని మనోహృద్య ప్రమోదాంకు గా
భ్యుదయస్థానము, మితసమ్మద కళాపూర్ణోదయము, విద్వాంసు భా
స్వదకావ్యమ్ము రసజ్ఞమండల హృదిస్థాయిరై వెల్గుతన్
సాహిత్రంబు కవీంద్రబాంధవసుహృత్స్వాంత ప్రమోదావహ
దక్షాభిరింకవ సైఫ్రణీవిలసగా దాత్యప్రధా శ్రీయుశ
శ్శుభ్ర జ్యోత్స్నిక, మంతరంగము సుధాసిక్తశ్చపరిభూతౌచితీ
విభాసిజన్నవనీతమీకృతి రసాప్తింగుల్కు "శ్రీదేవిగన్"
"జానకీరాము" ప్రోత్సాహ సౌరభమ్ము
పూజ్య "వేంకట కృష్ణు" నామోదముద్రి
"రసిక శరణాగతి" ప్రాభవరాగ రేఖ
కృతికిఘటియించు శాశ్వతకీర్తి శోభ

చింతలపాటి నరసింహదీక్షిత శర్మ

# అభిప్రాయము

సాహిత్యార్ణవ కర్ణధార. సాహిత్యాచార్య కవీంద్ర, సాహిత్య సమ్రాట్, వేదాంతపారీణ, మహోపాధ్యాయ, కవి సార్వభౌమ, విద్యావాచస్పతి, మహాకవి మార్తాండ, కళా ప్రపూర్ణ **శ్రీ శివశంకరస్వామి**

**కవయిత్రీతిలక శ్రీమతి శ్రీ దేవమ్మ ఇతఃపూర్వము** రచించిన వాసవదత్తా పరిణయకావ్యమున ప్రౌఢమార్గ మవలంబించిన మార్గము మిగుల సరళము. ఒక వ్యక్తియందే వివిధ సరణులుండవచ్చును సందోర్భచితముగా ఆయా రచయిత్రులు నారికేళ, కదళీ, ద్రాక్షా, పాకములలో తమరచన లోకుల యభిరుచుల కందింప వచ్చును ఎల్లప్పుడు నొకేపాకమున కథా మాధుర్యమును సంతరించుట సముచితము కాదుగదా?

రసికశరణాగతి అన్నప్పుడు అందు రసికుడు ప్రధాన పాత్రముగా నుండవలెను రాసిక్యముకూడా అనగా శృంగార రసము సంభృతమై యుండవలెను అంగరసములు కూడా సముచితమైనవి జాలు వారుచుండనగును ఇందు శృంగారము ప్రధానమై అద్భుతరసము అంగముగ సంగతమైనది. స్వాదు పరాఙ్ముఖులు కాని వారెల్లరకును ఇందలి వస్తువు ఇంపు గూర్పను కేవల తర్క కర్కశ బుద్ధులకును హేతు వాద ప్రియులకు అధునిక నాస్తికులకును కొన్ని యెడల సహ్యాము కాక పోవచ్చును ఈకథకు ఆధార మేదియో స్పష్టమగుటలేదు కాని ఏదో ప్రబలమైన ఐతిహ్యముండి తీరును.

ఈకావ్యము నామూలాగ్రముగా పఠించి ముగించినప్పటికి బెల్జియం దేశీయుడై ఫ్రెంచ్ భాషలో రచన చేసిన మేతర్ లింక్ మహాశయుని "బియాత్రిస్" నాటికయు జర్మనీ దేశీయుడైన సూరడర్ మన్ రచించిన ఒకానొక నాటకము స్మృతిపథమున మెఱసినవి ఇట్లనుటచే పరదేశములందు సైతం ఇట్టి భావములే పరిణామములుకల వస్తువులు ప్రచురితములగుచున్నవని తాత్పర్యము

## భక్తి బహు విచిత్రమైనది

నిజమే ఈకాలమున మంత్రములకు చింతకాయలు రాలునా అని ప్రశ్నించు వారు పలువురు కలరు అస్మదాదులు మంత్రములకు బలమున్నదనియే విశ్వసింతురు భక్తివలనఎన్నో అద్భుత సంఘటనలు జరుగుచుండును భక్తిబలిష్టము స్వచ్ఛము కావలెను అంతే

భగవత్తత్వముకూడా భక్తుల కోరికల నీడేర్చుచుండును భక్త వాంఛితము ఒక్కొక్కప్పుడు ఋజువైనది కాక పోవచ్చును ఏది ఎట్లైనను భగవానుడు భక్తపరాధీనుడు కదా!

భక్తుని రక్షించుటకు వచ్చెనని ఫక్కీని గాఢముగా పరికించినచో చూపరకు సత్యముగానే తోపవచ్చును అయ్యది తాత్కాలిక మైననూ కావచ్చును శాశ్వతమైన దైనను కావచ్చును.

కవయిత్రి వైష్ణవి అగుటచే విష్ణు సంబంధమైన కథను స్వీకరించినది. ఈమె ఘటన ఆంధ్ర దేశమున శ్రీకాకుళమున నడచినట్లు నిర్ధారణచేసి ఆంధ్రాభిమానమును వెల్లడించి ఆంధ్ర నాయక మహావల్లభుని వర్ణించి విష్ణుపారమ్యమును నిరూపణము చేసినది రచన చేయువారు తమ యిష్ట దైవముల ప్రధానము చేయ వచ్చును సగుణోపాసనములో శివ కేశవులలో ఎవరో యొకరు ప్రాధాన్యము వహింపక తప్పదు

ఈ కావ్యమున కవయిత్రి తిలక సుప్రసిద్ధ వృత్తములను వాడినది అయ్యవి ఎచ్చటనూ నట్టుటకక సరసముగా జాలు వారుచున్నవి ఈమె రీతికి తగిన వృత్తమునే స్వీకరించును.

"నీ నామమును" 4వ పుటలో దండకము కావ్యాంత మున "ఇది శేషాచలరాట్" అను వృత్తేభము, అనంతరము పుష్పమాలికాబంధము గమనార్హములు.

ఇట్టి రసవత్కావ్యము రచించిన కవయిత్రికి శుభం భూయాత్ ఈకృతి పది కాలముల పాటు వర్ధిల్లదగినది.

ఇతి శమ్

సాహితీ సమితి,
ఒంగోలు
11-5-76

శ్రీ శివశంకరస్వామి

భాషాప్రవీణ
కొమాండూరి రామానుజాచార్యులు
సీనియర్ తెలుఁగు పండిట్
జిల్లా పరిషత్ హైస్కూలు మొగళ్ళూరు ప్రకాశం జిల్లా

శ్రీ రామాయ నమః

# మణిదర్పణము

"కవినిఁగన్నతల్లి గర్భంబు ధన్యంబు
కృతినిఁ జెందువాఁడు మృతుఁడు గాఁడు"

## అభిరామ సుకవిశేఖరులారా!

నన్నయ, శ్రీనాథాదుల వంటి మహామనీషులైన కవులకు నాడు లేని కారణముగ పురాణరచన-ప్రబంధరచన-పూర్తిగ కనుమఱుగైనది పైగ నేటి యువసాహిత్యలోకమునకు వాటిపై రుచియు సన్నగిల్లినది అట్టి తరుణమున సంద్రపుపొంగువలె ఖండకావ్యముల యుగమారంభమైనది ఇదియు వింతపోకడలతో విలయ తాండవము చేయుచున్నది వీనియందలి కథావస్తువు కేవలము కథలోనేక మాత్రమే కొన్ని ప్రకృతి వర్ణనతోనున్న మఱికొన్ని కేవలము కథకు మాత్రము ప్రాధాన్యమిచ్చుచున్నవి మఱికొన్ని శృంగార ప్రాధాన్యముగ వెలయుచున్నవి.

అట్టివాట్టి కావ్యసంతతిలోఁగుంకుమ సంకోపెల్లి కవయిత్రీ తిలక. శ్రీమతి వికాస్రిల శ్రీదేవమ్మగారు ప్రాచీనార్వాచీన కావ్యసంతతులఁజవి చూచిన వారు గాన నమ ప్రాగ్భాస్వరిలో "రసికశరణాగతి" యను నఖండ కృతిని రచించి సాహిత్యా రామమున సంచరించు రసికసాహిత్య జిజ్ఞాసువులకుఁ బిపాస నీర్పనెంచినారు ఇది యెంతయు ముదావహము ఇదిలోగడ వీరి రచనలగు "ప్రార్థనాలహరి" "వాసవదత్తా పరిణయము" మున్నగు కృతులకన్నఁగవితా విషయములోనగాని, కథాకథన పద్ధతి లోనగాని. ఆలంకారిక ప్రావీణ్యము నందుఁగాని. సుగుణ జాల మందుఁగాని. మిన్నగనున్నఁదగినది.

ఈయమ భర్తగారైన శ్రీమాన్ శేషాచార్యులవారు ప్రౌఢ ప్రబంధ రచనా ప్రావీణ్యమునందు సిద్ధహస్తులు సంస్కృతాంధ్ర భాషలలో డెబ్బది కావ్యములు వివిధ భంగి మలలో వెలయించిన పండితమండనులు "ఛాయేవానగతా యన్నట్లీ మెయు వ్యవహార లోకమునసే గాక కావ్యలోకము నను మగని యడుగు జాడలనే నడచు స్వభావ యగుట యీ కావ్యమున వారి కవితాచ్ఛాయలు గోడచాటుగఁ దొంగి చూచు చున్నవనుటలో విప్రతిపత్తి యేమియు లేదు అదియు మోతాదు మించక యుపదంశము వలె నుండి పాఠకులకు నా లోకనాలోచనలను గలిగించు చున్నవి

కవయిత్రికిఁబ్రబంధ పరిచయము మెండుగనున్నట్లు తెలియ జేయుటకో యన్నట్లు దేవదాసి వర్ణనమందును అచ్చట

స్వామివారి గాథలను లిఖించుచున్నట్లును ఆ వాసన కనులకుఁగట్టి నట్లును, గొట్టుచ్చినట్లును గనుపడుచున్నది ప్రబంధ పరిచయము చూచునపుడు "ఆఱువపారీణుననంగనిత్తెకిన్" ఇటు నన్నయ భట్టారకుఁడు మనకు జ్ఞాపకమునకు రాకగలఁడు " ఎందఱు సుందరుల్" "కుంకుమ మిటారి" అన్న పద్యములు చదువునప్పుడు పెద్దన్న రామరాజభూషణులు మనలనే పలుకరింతురు. "నగుభుజముల్" మున్నగు పద్యములలో పద్దన్నను విజయవిలాసము స్మరణకు రాకయుండదు,

## సంగ్రహముగా నీ కావ్య కథ యిది

ఆంధ్రవిష్ణుని పూజకుఁ ప్రతిదినము రాజాంతఃపురము నుండి పూల మాలలు వచ్చుచుండెవి మఱునాఁడు మరల నంతఃపురమునకుఁ జేరుచుండెడివి, ఇట్లుండ నొకనాఁడా పుష్పదామముఁ దెగబారెడు వెంట్రుక వచ్చుటతోఁ గథ యంతయు నడ్డము తిరిగి యర్చకుని బ్రతుకు బండారము బజారులోఁ బడెను అంత నర్చకు రప్పించి దీని కారణమును నిగ్గదీసి యడిగిరి అతఁడు పలుకు బింకముతో "వెంటుకల్ కంజాక్షు నిర్మాల్యమున్ గొనఁజిక్కుబడి యూడి వచ్చినవి మీకున్ గోపమిట్లేటికిన్" అనెను పరీక్షింప రాజాంతఃపురమంతయు బయలు దేరెను. భక్తత్రాణ పరాయణుడైన బిరుద ప్రాగల్భ్యుఁడైన స్వామి యాసమయమునకుఁగుంతల భూషితుఁడై కనులఁబడెను యదార్థాయథార్థములై కాని వేషములఁ బట్టి లోఁగఁగా

రక్తసిక్తమై యుండ రాజ్యాంగమంతయు భయపడి పశ్చాత్తాప సంతప్తమై భగవద్భాగవతాచార్యులను వేవేల గతులఁ బ్రార్థించెను రసికుడైన యర్చకుఁడు శరణాగతుఁడుగాఁగా నభయమిచ్చి రక్షించెను కాన గ్రంథమునకుంచిన పేరు ప్రత్యక్షరము సత్యమనిపించు చున్నది

ఇంక సీఘుట్టమందలి పద్యములు భక్తినే గాక ప్రపత్తిని గూఁడ జాటి చెప్పు చున్నవి కవయిత్రియే గాక పాఠకుఁడును స్వామి సమక్షమున నిలుచుండిస్తుతించు చున్నట్లున్న అర్చకుని ప్రార్థనయు నిశ్లైహృద్యముగ నున్నది ఈ చిక్కును విడఁదీయు మనియో యీ బంధమునుండి తప్పింపు మనియో యన్నట్లు- ఒక ద్వ్యక్షరిని ఒక శ్లోకమును దండకమును జదివి యొక చంపకమాలిక సమర్పించినది ఇది యౌచిత్యముతోఁ దుష్టినిఁ గలిగించు చున్నది ఇది కథా సంవిధానమున కాటంకము గలుగ నీయక జాగ్రత్తవహించుటముదావహము "రసిక"పదమును సార్థకము చేయుటకో యన్నట్లు విద్యానిధి చంద్రరేఖల శృంగార వర్ణనము కొంచెము మోతాదు మించినట్లు తోఁచును కాని మన ప్రబంధములలో నీరసమునకున్న ప్రాధాన్యత తక్కువంగల వాటికి లేదు అందునఁ గొంచెము హెచ్చు లొచ్చు మద్దుపళని "రాధికా స్వాంతనము" ముందిదెంత?

మొత్తము మీద రచయిత్రి కవిత పూర్వ కవుల కావ్యములకే మాత్రము మొక్కవోని భావ గంభీరత, శైలీ

కవిశేఖర

# శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యుల వారు

ఉన్నత పాఠశాల ఆంధ్రోపాధ్యాయులు

గూడూరు

శ్రీమతి విశాల శ్రీదేవమ్మగారు లబ్ధప్రతిష్ఠులైన కవిమణి బహుశాస్త్ర కోవిదులు, శ్రీనివాస ప్రసాదాది మహాకావ్య నిర్మాతలు మహాకవి బిరుద భాసురులు సుగృహీతనామధేయులైన శ్రీమాన్ విశాల శేషాచార్యులవారి ధర్మపత్ని భర్తృసాహచర్యమున ఈమె సంస్కృతాంధ్ర భాషలలో మిక్కిలి పరిశ్రమ సల్పి, కమ్మని కవన శక్తి గడించినారు ఈ విదుషీమణి రచించిన వాసవదత్తా పరిణయము పండిత ప్రశంసలు వడసి దేశమున బహుళ ప్రచారముపొందిన ప్రబంధరాజము శ్రీకాకుళాంధ్ర నాయకుడు వేశ్యాలంపటుడైన తన గుడి పూజారి నుద్ధరించిన రమణీయ గాథయే "రసిక శరణాగతి" ఇది భక్తి శృంగార ప్రధానమైన మధురకృతి ఆకృతిలో చిన్నదైనను గుణమున మిన్న ప్రతి పద్యము రసాస్పదము కవితా శైలి సంప్రదాయ బద్ధము పరమసుకుమారము, ప్రసాదగుణశోభితము హృద్యము, అనవద్యము

ఈమె మధురమైన కవిత్వము రచించుటయందు ఎంతటి సమర్థురాలో ప్రౌఢమైన చిత్రకవిత్వము చెప్పుటయందును

అంతటి ప్రబుద్ధురాలు చిత్ర కవితా కౌశలమును ముందు వాసవదత్తా పరిణయములో కొంత విరివిగఁజూపి యున్నారు ఈ లఘుకృతి యందును ఆ చాతుర్యమును రెండు మూఁడు తావులఁగనుపరచినారు 42వ పుటలో కందపద్యము పూర్వార్థము ద్వ్యక్షరి నకార – మకారము లతో రచితము ఇఁక నుత్తరార్థము పై యక్షరద్వయములోని మకారమునువదలి ఒక్క నకారములోనే రచితము ఇట్లు ఒక్క పద్యమునందే ద్వ్యక్షరి ఏకాక్షరి చిత్రములు పొందు పరచబడినవి గ్రంథాంతమునందు కృతి పతియైన (శ్రీ) వేంకటాచలపతి పుష్పమాలికాబంధముతో నలంకృతుఁడైనాఁడు 26 వ పుటలో నుత్పలమాల యందు నాయికా నాయకుల యొక్క సంభాషణము సభంగా – భంగ శ్లేషలతో చాల మనోహరముఁగ గూర్చఁబడినది చూడుడు–

"నీ విటునన్ సదా రతుల నీరజనేత్రి గరంచు టెల్ల నా
పావన పూర్వ పుణ్య పరిపాక మటంచని కాంతుఁడాడినన్
మావిభుఁగాఁ దలంచి నవమన్మథ! నిన్ రతిఁగొల్చుచున్ననన్
నీ విటునంట పాడియగునే యనుఁ గాంతయు శ్లేష యొప్పగన్"

నీ విటునన్ అను మాటలో నీవు–ఇటు–నన్ నీవు ఇట్లు నన్ను అని నాయకుని మాటలోఁబైకిఁదోచు నర్థము నీ విటున్ నన్ నీజారుఁడనైన నన్ను అని అంతరార్థము ఇందలి ఈ రెండవ యర్థమునకు – తను వలచిన నాతనినే భర్తను గాను భగవంతుని.ౘాను ంచిను చున్న నాయిక ఇఁచుక కినుకతో–

"మావిభుఁగాఁదలంచి సవమన్మధ నిన్ రతిఁ గొల్పుచున్న నన్ నీ విటు నంట పాడి యగునే అని హెచ్చరించినది మా భర్తను గాఁదలంచి "రతిన్" సంభోగముతో నిన్ను గొలుచుచున్న నన్ను అని పైకిఁదోచు నర్థము ఇఁక_మా_విభుఁగాన్ దలంచి లక్ష్మీనాథునిఁగాఁదలంచి "రతిన్" ఆసక్తితో నిన్నుఁగొలుచు చున్న నన్ను నీ విటునంట (గ్ర_ఇట్లు_అంట నీవుఇట్లుఅనుట, నీవిటున్_అంట నీజారుని యనుట) తగునా? యని హెచ్చరించినది ఇది ఈరతిగ శ్లిష్టార్థమని తెలియు నిమిత్తము "శ్లేష యొప్పగన్" అను పదము సూచన

శృంగార రసము గిట్టని నవీనులు కొందఱు ఇందు శృంగారము కొంత మోతాదు మీఱి యున్నదని తలంచెద రేమో? కథానాయిక వేశ్య గనుక అది సమంజస మేనని అభిజ్ఞులకుఁ జెప్పపనిలేదు

నేఁడు నవలా రచనమున కృతహస్తలైన నవలా మిన్న లున్నారు గాని పద్య రచనమున నీమెవలె చేయి దిరిగిన మహిళామణులు లేరు ఉండిన ఒకరిద్దఱుండవచ్చును

ఇంత చక్కని కృతి చెప్పిన సోదరీరత్నము శ్రీమతి శ్రీదేవమ్మగారికి నా మంగళాశంసలు

గూడూరు<br>
21_5_76 } ముదివర్తి కొండమాచార్యులు

శ్రీమతే హయగ్రీవాయనమః

# విన్నపము

అత్యంత పురాతనకాలము నందలి దేశ చరిత్రములే పురాణములు అవిబహుయుగములందలి శిష్టులయు దుష్టులయు జీవితములతోఁబాటు సందర్భవశాత్తు శిక్షణీయములైన యనేక విషయములను వివరించు చుండును అట్టి వానిలోఁ గొన్నిటఁ గొన్ని భాగములు కృష్ణా గంగాది తీర్థమాహాత్మ్య ప్రతిపాదకములు మఱికొన్ని స్థలమాహాత్మ్యబోధకములు ఇవి శ్రీరంగ మాహాత్మ్యము, కాశీమాహాత్మ్యము మున్నగునవి ఇంకఁగొన్ని పర్వత మాహాత్మ్య పరములు ఇవి పర్వత ప్రదేశములలో దేవతలు వెలసిన విశేషములను వివరించునవి శ్రీ వేంకటాచల మాహాత్మ్యము శ్రీశైలమాహాత్మ్యము మున్నగునవి ఖ్యాతిఁ జెందినవి కొన్ని కాలప్రభావ ప్రతిపాదన పరములు ఇవిమాఘ మాహాత్మ్యము ఏకాదశీ మాహాత్మ్యము మొదలైనవి స్థల మాహాత్మ్యము తాయా స్థలములలో మునులు తపముసలుపుట వేలుపులు వెలయుట మున్నగువిషయములను వివరించునవి. వీనినే స్థలపురాణములని, క్షేత్రమాహాత్మ్యములని చెప్పెదరు ఇట్టి వానిలో శ్రీకాకుళమాహాత్మ్య మొక్కటి

ఈ శ్రీకాకుళక్షేత్రమష్టోత్తర శతదివ్య దేశములలోఁ జేరినది. "కాకుళేత్యాంధ్రనాయక"మ్మని శ్రీ విష్ణోరష్టోత్తర

శతదివ్యదేశస్తోత్రము. ఈ గ్రామము కృష్ణాజిల్లాలోని దివి తాలూకాలోఁ జేరినది మచిలీపట్నము నకు నిరువది నాలుగు మైళ్ళ దూరమున గలదు ఆంధ్ర సామ్రాజ్యమునకు బ్రథమ రాజధానీనగరము ఈ క్షేత్రమునందు బూర్వయుగములలో శ్రీమన్నారాయణుడు రఘు యదు వంశములలో రాముఁడు గాఁగృష్ణుఁడుగా నవతరించి, దుష్ట శిక్షణ శిష్ట రక్షణముల నొనర్చి స్వాయంభువ మన్వంతరము నందలి కలియుగములో సుచంద్ర మహారాజు యొక్క తపఃఫలముగ నాయనకుఁ బుత్రుఁడుగా నవతరించి లోక కంటకులైన యనేకదుష్టదానవ బలముతోఁగూడిన నిశుంభుఁడను దానవుందునిమి "ఆంధ్రులు తన శిష్టమైన వారలనియు, వారి ప్రీతి కొఱకు నిట నివసించెద ననియు" నుడివి శ్రీకాకుళమును రాజధానిగఁ జేసికొని భూమండలమును ధర్మబద్ధముగ శిష్టజనానందకరముగ నేలెను ఈ స్వామిగారే "యాంధ్రనాయకుఁడు" ఆంధ్రవిష్ణువు, తెలుఁగు రాయఁడు శ్రీకాకుళేశ్వరస్వామి యనుమున్నగునామములతో నీ స్వామి పిలువఁబడుచున్నాడు. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండైన యీస్వామి నాంధ్ర నాయకుండనుటయేమి? యన్నచోఁ దిరుపతి యందు "వేంకటేశ్వరుఁడు" వైకుంఠము నందు "వైకుంఠనాథుఁడు" అను మున్నగు నామముల వంటిది అనఁగా నాస్వామికీ క్షేత్రము నందంతటి ప్రీతి గలదని యెంచ దగును ఏననిది యశేష కళ్యాణ గుణగణ పరిపూర్ణునకుఁ బక్ష.

పాతము గాదాయనిన నయ్యాది దేవతా పక్ష పాతిత్వ దాన
వారిత్వముల వంటి లీలయని భావింపఁదగును ఈ శాస్త్రరహ
స్యమును బట్టియే మాపితామహచరణులు కాశిహస్తి సంస్థాన
విద్వాంసులు షడంగవేదజ్ఞ బిరుదాంచితులైన శ్రీ మాన్
కళత్తూరు వికాల రాఘవాచార్యులవారు "ఆంధ్రదేశభాషా
మహిమానువర్ణన" మను గ్రంథములో-

శ్లో॥ నిరీశ్వరాః పరా దేశా ఆంధ్రాస్త్వేకోఽస్తి సేశ్వరః
యత్రాఽఽస్తే భగవాన్విష్ణు రాంధ్రనాయక సంజ్ఞయా॥

యని యాంధ్రదేశ ప్రాశస్త్యముల వర్ణించుటలో బ్రతి
పాదించినారు.

ఈ శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్య గ్రంథములో నా
క్షేత్రమునందు శ్రీహరి సాక్షాత్కారార్థము బ్రహ్మ యాగ
యోగాదులుజరుపుట భగవదావిర్భావము, కళ్యాణము దానవ
జన ధ్వంసము కడకా దేవదేవుఁడు నృసింహ రామకృష్ణులవలె
నర్చామూర్తిగ వెలయుట ఆయా యర్చావతారమందును
ననేక భక్తజనుల రక్షించుట మున్నగు నా స్వామి యొక్క
విచిత్రములైన పలు పవిత్ర చరిత్రములు గలవు.

ఈ దేవదేవుని మాహాత్మ్యపరమయిన సంస్కృత
గ్రంథమును గొందఱు తెనుఁగు కవులాంధ్రములోని కనువదిం
చిరి వానిలో భట్లపెనుమర్తి కోదండరామకవి "వల్లభాభ్యుదయ"
మను పేర ననువదించిన పద్యకావ్యము వ్రాతప్రతిలిఖిత గ్రంథా

లయములలో రాణివాసము చేయుచున్నది. ఒకరిద్దఱుగావించిన వచనానువాదములు ముద్రితములైనవి అందునయ్యాది దేవుని యర్చకులలో నొకపడుచువాఁడయ్యాలయము నందలి నర్తకీ క త్రియలలోఁదరుణీశిరోమణియగు నొకపడుచు వేశ్యారత్నమును గామించి కామలోలుఁడై యుండి తన తప్పిదము వెల్లడియై రాజదండనము గలుగనున్న సమయమున నా స్వామిని శరణు జొచ్చి రక్షితుఁడైన కథ చాల సరసమైనది. యొకటి గలదు ఈ కథ యా భగవంతుని వాత్సల్య వారిధిలోని యొక విప్రుషమే ( బొట్టు ) అనగా నా శ్రియఃపతి వాత్సల్యదయా విశిష్టుఁడగానఁదప్పుఁ జేసినను శరణు జొచ్చిన వారినిఁ గాచిన కథలలో నొకటి.

సరసతరమైన యాకథను గైకొని నాభార్య కవయిత్రీ తిలక శ్రీదేవమ్మ విష్ణువాత్సల్యసుధావిప్రుషము అను నామాంతరముగల యీ " రసిక శరణాగతి " కావ్యమును రచించినది ఇది రచితమైన కొలఁది నెలలలో దీనినిఁ జూచి నరసరావుపేట వాస్తవ్యులు భారతగర్భ రామాయణమువంటి యపూర్వ చిత్రకావ్య ప్రణేతలు కవితాకోవిద బిరుదాఢ్యులు నా రచితమైన శ్రీ వేంకటేశ్వర చిత్ర రత్నాకర ముద్రాపకులునయిన శ్రీయుతులు రావిపాటి లక్ష్మీనారాయణ గారు ( రిటైర్డు సబ్ కోర్టు శిరస్తదారు ) చాల సంతోషించి దీనిపై

సమీక్ష వ్రాసి నరసరావుపేట నుండి వెలువడు కల్పవల్లి పత్రికలో 15-12-1968 తేదీన ప్రచురించిరి

నాటినుండి నేటివఱకు వెలుఁగుఁజూడని యీశాస్త్ర గ్రంథ మొక విచిత్ర సన్నివేశములో జరిగినది మహిళా సంవత్సర సాంస్కృతికోత్సవ సభలు చీరాలలో జరిగినవి ఆ సభలకు చీరాల మునిసిపల్ కమీషనరు మరియు స్పెషల్ ఆఫీసరు గారైన శ్రీయుతులు పాలాటి బాలకృష్ణరావుగారు యాజమాన్యము వహించిరి ఆ సభలలో నుపన్యసించుటకై నేను నా భార్యయు వెళ్ళితిమి. శ్రీ కమీషనరుగారిచే సన్మానమును బొంది, N R. & P.M H. స్కూలులో హిందీ పండితులు గానున్న మా మిత్రతములు సాహిత్యరత్న శ్రీమాన్ దిట్టకవి శ్రీనివాసాచార్యులవారి గృహమున బసచేసితిమి పైనఁదెల్పిన పురపాలకోన్నత పాఠశాలయందే తెలుఁగు పండితులుగాఁ బని చేయుచున్న మా మిత్రవర్యులు భాషాప్రవీణ శ్రీ యుత జొన్నలగడ్డ జానకిరామయ్యగారు మేమున్న యాచార్యుల వారి గృహమునకు వచ్చిరి. వారు వీరింటికిఁ దఱచువచ్చి యిష్టకథావినోదంబులఁ గొంత తడవు ప్రొద్దుపుచ్చుట పరిపాటి వారి మైత్రియట్టిది. వచ్చినవారితోఁగొంతతడవు మేముభయులము (నేను.నాభార్య)సారస్వత విషయములపై సరససాహిత్యగోష్టిసాగించితిమి. ఆసాహిత్య చర్చలోఁ బ్రాసంగికముగా నా భార్య రచించిన యాముద్రిత గ్రంథముల ప్రస్తావన వచ్చినది

వెను వెంటనే వెనుకముందాలోచించక సరసహృదయులు, ఉదార చిత్తులు నైన శ్రీ జానకిరామయ్యగారు ఉదారభావముతో నా కావ్యమును ముద్రింపింతునని వాగ్దానమొసంగిరి ఇది మా సాహిత్యచరిత్రలోని యపూర్వసంఘటన మేము ధన్యులము ఆనందపరవశులమైతిమి మేము మా స్వగ్రామమును మా చేరితిమి.

అటుపిమ్మట శ్రీ జానకిరామయ్యగారు మా తండ్రిగారు స్వగృహమున స్థాపించిన గ్రంథాలయమును జూడ ముచ్చటపడి శ్రీమాన్ శ్రీనివాసాచార్యులవారిని వెంటనిడుకొని కలికివాయలోని మా గృహమునకు వచ్చిరి గ్రంథాలయమును వీక్షించిరి నేడనుపలభ్యములగు నపూర్వ గ్రంథములను అముద్రిత సంస్కృతాంధ్ర గ్రంథములను శతాధిక తాళపత్ర గ్రంథములను తిలకించి యానందాశ్చర్యనిమగ్నులైరి ఆ యముద్రిత గ్రంథములలో నా తండ్రి రచించిన యీ "రసిక శరణాగతి" యను కావ్యము నవలోకించి విష్ణువాత్సల్య సుధా తరంగిణీ తరంగితాంతరంగానందలహరీ సంప్లావితాంతఃకరణులై సాహితీ ప్రియులగు తమ యన్నగారైన శ్రీయుతులు "జొన్నలగడ్డ వెంకటకృష్ణారావు" గారి నీకృతికిఁ గృతిపోషకునిఁ గాఁ జేసి వారి యౌదార్యముతో నీగ్రంథమును నేను స్థాపించి నడపుచున్న "ప్రకాశిని" గ్రంథమాలలోఁ బదమూడవ ప్రసవముగ ముద్రించి సూర్యాలోకన భాగ్యమును

గలిగించిరి అష్టవర్ష ప్రాయయగు నీకృతికన్య నేటివఱకు వసూర్యంపశ్యయై పితృ వాత్సల్య సుధావిప్రుష విశేషపరిభావంబున నేటికి సర్వాంగ సుందర సమలంకృతాలంకారయై యొప్పారు కతన మాయానందమున కవధులు లేవు పితృవాత్సల్యమెప్పుడెట్టి రీతులఁగలుగునో తెలియదు గదా!

ఇట్లీ గ్రంథమునకు పూర్వాలోకన భాగ్యము గలిగించి కృతి పోషకులైన శ్రీయుతలు జొన్నలగడ్డ వేంకటకృష్ణారావు గారికి, వారితమ్ములైన శ్రీజానకిరామయ్యగారికిని కృతజ్ఞతా వందనములు ఈ గ్రంథమును గుఱించి తమ తమ యమూల్యాభిప్రాయములఁబంపిన సహృదయ వరేణ్యులకు మా నమస్కృతులు. సర్వాంగ సుందరముగా ముద్రించి యిచ్చిన కుబేరా ప్రింటర్సు (చీరాల) వారికి మా యభినందనములు.

ఇట్లు
మహాకవి, చిత్రబంధకవి, సుధీమణి
విక్రాల శేషాచార్యులు
గ్రంథమాలా సంపాదకుఁడు

కలికివాయ
15-5-76

# కృతిపోషకులు



శ్రీవరమందుఁదాల్చు సురసేవ్యుఁడశేషదయాత్మమాది క
ళ్యాణగుణాకరుండు కమలాక్షుఁడమంరితభక్తి నీకృతి
న్మానుగనుద్ధరించిన కనద్యశు జొన్నలగడ్డ వంశజున్
మానితచర్యుఁ బ్రోచుత సమావృతి "వేంకటకృష్ణరాయనిన్"

శ్రీరస్తు

## -: కృతిపోషక ప్రశంస :-

శ్రీసురమందుఁ దాల్చు సురసేవ్యుఁడశేషదయాక్షమాది క
ళ్యాణగుణాకరుండు కమలాక్షుఁడతుంద్రతభక్తి నీకృతి
న్ప్రాణుగనుద్ధరించిన కనద్యశు జొన్నలగడ్డ వంశజున్
మానితచర్యుఁ బ్రోచుతి సమాదృతి వేంకటకృష్ణరాయునిన్.

ఎన్నికఁగన్నదై కరము హెచ్చెడుకీర్తికినాలవాలమై
పన్నియు వాసియుంగలుగు పండితకాండముచేతమన్ననల్
గన్నదియై విశుద్ధమయిగ్రాలుచుఁదామరతంపరట్టులన్
జొన్నలగడ్డవంశమిల శోభిలు సత్కవివంశసేవ్యమై

గీ. హారితగోత్రులు వేదవేదాంగవిదులు
సత్యసంధులు చారువిశాలమతులు
మాననీయులు జ్ఞానవిజ్ఞాననిధులు
జగతి "జొన్నలగడ్డవంశంబు" వారు.

గీ. అట్టివిప్రులలోన బల్దిట్టయగుచు
నలరు "వేంకటనారాయణయ్య" యతని
పుత్రుఁడతిదాత "కృష్ణయ్య" భూరియశుఁడు
వాని తనయుండు "బ్రహ్మయ్య" దానశీలి,

గీ. తనయులార్గురు నిద్దరు తనయలమరఁ
బార్వతినిమించు "రామసుబ్బమ్మ" ధర్మ
పత్నియైప్రీతివర్తింపఁ బరమనిష్ఠ
నలరు "బ్రహ్మయ్య" మతియింపనలవియగునె.

ధర "వేంకటప్పయ్య" ధర్మాభినిరతుఁడై
సతతంబుచరియించు సాధుమూర్తి
అతిథులఁగనిప్రియమార సంభావించు
"వేంకటకృష్ణయ్య" వినయమూర్తి
సాధుసత్పురుషుల సాంగత్యమొనరించు
"ఘను డు" సుబ్రహ్మణ్యుఁడనఘమూర్తి
వేంకటేశునిమదిఁ బ్రీతినారాధించు
"లక్ష్మీనృసింహుండు" లలితమూర్తి

గీ. "జానకీరాముఁడ"త్యంతశాంతమూర్తి
"సత్యనారాయణుండు" సౌజన్యమూర్తి
వరసుగుణజాల "లలితాంబ" పరమసాధ్వి
సకలసద్గుణనికురంబ "జానకమ్మ"
యనుచు వినుతింపబుధులెల్ల హర్షవార్ధి
నోలనాడును "బ్రహ్మయ్య" శీలమూర్తి.

గీ. మానికంబన వీని సంతానమందు
నలరు వేంకటకృష్ణాఖ్యుఁడనవరతము
తమ్ములను వేడ్కఁ జెల్లెండ్రఁదండ్రిపోల్కి
పెంచి వృద్ధికిఁదెచ్చె బల్ప్రేమమీఱ.

కం వరసుగుణాకర యనిపె
క్కురుదెల్పఁగవించుఁదపతుఁగూర్పఁగఁబెద్దల్
సురుచిరముగఁ బెండ్లాడెను
స్థిరమతి(శ్రీ)"రాజ్యలక్ష్మి"ఁ దీయనిమమతన్

సీ. ధనధాన్యములతోడఁదనరుచు ననిశంబు
చెన్నొందు చేబ్రోలు గన్నభూమి
భావనారాయణస్వామికి నెలవౌచుఁ
బరగు పొన్నూరు నివాసభూమి
స్నానసంధ్యాద్యనుష్ఠానముల్ నిరతంబు
జరుపుచుఁజరియించు సత్ప్రవృత్తి
శతృవునకునైన సమయాన సాయంబు
సేయ సంకల్పించు చిత్తవృత్తి

గీ. గలిగి తనగుణములకెల్ల లలితముగను
దగినరీతిని వర్తించు ధర్మపత్ని
"రాజ్యలక్షమ్మ" కరమనురక్తి గూర్ప
నుండు వేంకటకృష్ణరాయుండు ధరణి.

కం. ఘనతఁ బ్రభుత్వోద్యోగము
జనములు కొనియాడ సల్పి సర్వీస్సై పో
యిన వేంకటకృష్ణయ గృహ
మున ననుజులతోడ నుండు మోదముమీఱన్.

కం. పంకములింకన్ భక్తవ
శంకరుఁడగు శౌరిపాదసరసీజములన్
వేంకటకృష్ణయ యెపుడా
తంకంబులు లేక గొల్చుఁదనవారలతోన్.

గీ. అన్నదమ్ములు కలఁతల నందకుండ
నండగా నన్ని సమకూర్చుచుండు నింట
నమిత వాత్సల్య పరిపూరితాత్మయగుచు
సాధ్వియౌ వీరిసోదరి "జానకమ్మ"

కం. అనుజులలోపల లక్ష్మణుఁ
డనయము రాఘవునిఁగొల్చునట్లు విడక బల్
ఘనమతి వేంకటకృష్ణా
ర్యుని జానకిరామశర్మ యెప్పుడుఁగొల్చున్.

గీ. వినుతశీలుఁడు భాషాప్రవీణుఁడమల
యశుఁడు చీరాల మునిసిపల్ హైస్కూలు
నందునఁదెనుఁగు బాసకధ్యాపకుండు
నగుచు జానకిరామయ్య నెగడుచుండు.

గీ. గౌరవము మీఱ విద్యార్థిగణము మెచ్చ
జ్ఞానపీయూషఝురములు జాలువాఱ
నీతిమార్గధర్మంబు నెఱపుచున్న
యితని పాండితీవైభవం బెన్నఁదరమె.

గీ. పదియుఁదొమ్మిదినూటయేబ్బదియునైదు
లో నవంబరు పదునెన్మిదినఁ బ్రిభుత్వ
సభకుఁజేరాల సవిన మాజంటతోడ
జానకీరామయకుఁబరిచయముగలిగె

గీ. గౌరవాఢ్యులు మామామగారు గృహము
నందు స్థాపించినట్టి గ్రంథాలయమ్ము
గనఁగ వేంకటకృష్ణార్యునకు జుఁడయిన
జానకీరామశర్మాభిధానుఁడొకట

గీ, నాదుపతి కాష్టుఁడదిగాక నయముమీఱ
మాకుటుంబపుసేమముల్ మదినిఁగోరు
"దిట్టకవి శ్రీనివాసార్య" ధీనివాసుఁ
"గలికివాయి" కిఁగొనివచ్చెఁగౌతుకమున.

వచ్చి యపారశాస్త్రరమవర్ధిలు గ్రంథసముచ్చయంబులన్
హెచ్చినప్రీతిఁగన్గొనుచు నిద్దఱుమత్పతి దేవుతోడుతన్
మచ్చికమాటలాడుచును మాకవితల్ దిలకించి యన్నియున్
సచ్చరితంబులే యనుచు జానకిరామయ ప్రీతినిట్లనన్

సీ. "శ్రీవేంకటేశ్వర చిత్రరత్నావళి"
సలిపితి బహుబంధములనుగూర్చి
వ్రాసితి బాగుగా "వాసవదత్తా ప
రిణయము" నసయము ఘనులు పొగ(డ
అద్భుతరసపూర్ణమైయొప్పు( "గృష్ణవి
రించీయము" రచించితంచితముగ
సురుచిరంబుగ "వసుంధర" రచించితి నవ
లలలోన మించు మేల్బంతిగా(గ
సాంఘికదృష్టితో సల్పి మెప్పందితి
ధర్మయుక్తంబైన "దైవలీల"

ఆ. వె. "భక్తచక్రవర్తి" "పార్థనాలవారి" "కాం
డిన్యవిజయము" లను ధన్యమతిని
వ్రాసి లోకమందు వాసిగాంచితివి "శ్రీ
దేవి"! యెవ్వరమ్మ దీటు నీకు.

ఆ. వె. అంచు సంతసమున నాహస్తములకట్టె
వెలయునట్టి "యాంధ్రవిష్ణుచరిత("
గాంచి చేత(బట్టి గ్రక్కున నను(జూచి
యమితమగుచు నొగడు నాదరమున

కం. చక్కని యీకృతి మాకి
మ్మక్కాయన కేఁబలికితి నాకృతిమున్నే
దక్కించుకొనియోఁదమ్ముఁడ
యెక్కుడు సద్భక్తి వెంకటేశ్వరుఁబలికెగా.

గీ. సరవి సంభాషణములిట్లు జరిగినంత
"విష్ణువాత్సల్యఘనసుధావిప్రియమను
రసికశరణాగతిన్" గాని ప్రీతిభక్తి
దన మనమ్మునఁ బెనగొనఁ దనిసి యతఁడు.

శౌరికి సంకితంబయిన సత్కృతినచ్చునకిచ్చి దానిను
ద్ధారముసేయుఁకంటె సుకృతంబొకటున్న ధరిత్రిలోపలన్
గరితి సౌఖ్యముల్ గలుగుఁ గీడులు దవ్వులకేగు మీఁద సం
సారము వృద్ధిసెందునని జానకిరామయ నిశ్చితాత్ముఁడై

కం. చిట్టకవి వంశమాన్యుఁడు
గట్టిగఁ జేదోడుగాఁగ గ్రంథము గొనుచున్
దొట్టగిలు భక్తి మదిలోఁ
బుట్టఁగ నిలుసేరి కరము మోదాన్వితుఁడై.

గీ. గ్రంథమగ్రజుచేనిడి కథను దెల్ప
సోముఁగాంచిన జలధినాఁ బ్రేమనతఁడు
పొంగి ధన్యుఁడనైతిని బోయటంచు
ననుజులనుఁజూచి ప్రీతి నిట్లని వచించె

గీ. జన్మమెత్తివదానికి జగతి సాధు
కార్యమొక్కటి సేయఁగాఁ గలను మగని
దెచ్చినాఁడవు నేటికి దివ్యకావ్య
మొండు ముద్రింపఁదమ్ముఁడ! యొప్పిదముగ

గీ. సప్తసంతానములలోన శాశ్వతముగఁ
గీర్తినొసఁగెడు నెవ్వఁడు ఖిలముగాదు
కృతియు అందును హరికావ్యమతిశుభమని
కృతికి ముద్రణభాగ్యంబు ధృతిని గూర్చె.

గీ. దయయు సత్యము శౌచము ధర్మచింత
గలుగు మనుజులఁగాపాడు కల్పవల్లి
ధర్మదేవత దయఁబ్రోచుతన్ జగాన
ఘనుని వేంకటకృష్ణరాయుని సతతంబు.

కవయిత్రీతిలక
ఎక్కాల శ్రీదేవమ్మ.



శ్రీమతే హయగ్రీవాయనమః

# విష్ణు వాత్సల్య సుధా విప్రుషము

అను నామాంతరముగల

# రసిక శరణాగతి

శ్రీ లక్ష్మీ జలజాస్యతోడ సుఖరాశిన్ దేలుచున్ నిత్యమ న
వేలాతీతకృపాపరాధములెదన్ వీక్షింపకే యార్తులన్
శీలన్ గోర్కులొసంగి బ్రోచు హరియా శ్రీకాంతు శేషుండు న
వాలన్ జాలఁగృపాలవాలుఁడగుచున్ బాలింపఁగేల్మోడ్చెదన్

ఎచ్చటనుండునో ధవుఁడు హెచ్చిన కూరిమి వెంటనంటి తా
నచ్చటనే వసించుచు రయమ్మున నాశ్రితలోకమున్ బ్రియం
బచ్చు పడంగఁబ్రోచెడి దయాంబుధి విశ్వపవిత్రి లక్ష్మి నే
నిచ్చఁదలంచి మ్రొక్కెదను హెచ్చఁగ నిచ్చలు మంగళావళుల్

అరయఁగ నాదు మెట్టిన గృహంబున భర్తకు మామగారికిన్
సరవిని వారి తండ్రికిని సన్నుత పాండితికీర్తినిచ్చి స
త్కరుణ జెలంగఁబ్రోచెడి జగంబుల విద్యల నెఱ జ్ఞయైన యా
హరిఁదురగాస్యు నెంచెద రసాంచిత సత్కవితాసుధాప్తికై.

కం. నలువకు వాణికిఁ దమ్ముం
గల సురలకు ఋషులకున్ సుకవులకు నాచా
ర్యులకున్ భర్తకు మ్రొక్కి ర
సలసిత మాంధ్రేశ భక్త చరిత రచింతున్.

సీ. కాంచి మితిలేని ప్రేమ నన్ బెంచి జ్ఞాన
సంపదల నొప్ప కవివశ్య సతి నొసఁగు
ధర్మనిరతులు నా తల్లిదండ్రులైన
రంగమన్నారు శేషాంబలన్ దలంతు

వసుధ విద్యారణ్య పంచాననుండు వి
ద్యావాక్పతియు నవ్యఖ్యాతుల నభి
రాముఁడౌ విక్రాల రామచంద్రాచార్య
ననుఁగు రెండవ కోడలైన దాన
వర్ణనీయోభయ భాషాకవీంద్ర శే
షాచార్య నిల్లాలనైనదాన
శాశ్వత శ్రీ వేంకటేశ్వర కరుణాప్త
కవన సంతతి రమల్ గలుగుదాన

తే. గీ. ధరను శ్రీదేవియను పేరఁ దనరుదాన
ప్రణుత వాసవదత్తా పరిణయ కావ్య
మునకు నను జన్మముగ నుపావన సరసము
వైష్ణవోత్తము కథ దీని వ్రాయుదాన.

గీ. శ్రీలతో ధర్మపరులౌ జనాలతోడఁ
జాల సొంపగు కుసుమవనాలతోడ
మేలు మేలనవచ్చు సౌధాలతోడ
లీల శ్రీకాకుళము దనరఁ గ్రాలుచుండు.

ఉ. అందు సుచంద్రనామ వసుధాధిపుదీర్ఘతపఃఫలంబుగా
నందనుఁడై జనించి వరనందకపాణి నిశుంభుఁ ద్రుంచి యా
నంద ఘనమ్ముగాఁ ద్రిభువనమ్మునరించి చిరమ్మునేల నే
లందగ నాంధ్రనాయకుఁడన లక్ష్మినిఁ గూడి మనున్ బ్రసిద్ధితిన్.

గీ. రామకృష్ణావతారమ్ముల రహినిఁ గుల
పెక్కు వేలేండ్లు గడపి యా విభుఁడు భక్త
జనుల కోర్కెలఁ దీర్ప శాశ్వతముగాఁగ
వెలసె నర్చాకృతిన్ గల్మి వెలఁదిఁ గూడి.

గీ. విఖనసఋషి పుంగవ ప్రోక్త వినత శాస్త్ర
సరణి సద్దేవదేవుఁడర్చా మహోత్స
వప్రముఖ సర్వకైంకర్య వైభవముల
నమితముగఁ బొందుచుండు నహరహంబు.

ఆ. వె. ఆంధ్రనాయకుండు నాంధ్రవల్లభుఁడును
నాంధ్రవిష్ణువనఁగ నా విభుండు
గోరువారికెల్లఁ గొంగుబంగారమై
ఖ్యాతితోడ నచటఁ గ్రాలుచుండు.

సీ. ఒకవంక శారికాశుక కోకిలమ్ముల
కలకూజితములు మేల్కొలుపుచుండ
నొకవంక నాహ్లాదమొలుకు ప్రాతఃకాల
పద్మగంధము గంధవహుఁడు దేర
నొకవంకఁ దేవా రెనో దేవ లెమ్మని
సుప్ర[illegible] భూసురులు సదువ
నొకవంక భక్తితో సకలోపచారము
లకళంకులగు సేవకాళి సలుప

గీ. భర్మగోపురనాల సంభాసమాన
భవ్యరత్న వినిర్మిత శయనగర్భ
మునుఁగ రమతోడ నేంచేసి యాంధ్రవిభుఁడు
కరుణ దయసాంద్ర దృష్టి జగాలఁబ్రోచు.

వారితిరుమంజనంపు సమయమ్మున నా విభుప్రేమాల వైష్ణవుల్
హారుగము మీఁద నిల్చి తగనైక్యగళంబుగ శ్రోత్రిఘుచ్ఛటల్
ఎగువులు వాఁడఁగాఁ జదువు పౌరుషసూక్తముఖమ్ము విన్న నే
పఁకఁగఁగ శ్రోత్రిసంపదకుఁ బారణనావలె నిక్కువంబటన్.

గీ. వడలు, శుండలు వడపప్పు పానకమ్ము
దోసె లప్పాలు పాలు దధ్యోదనమ్ము
నేతిపొంగలి పులిహోర ప్రీతిఁబాయ
సమ్ములన్ సాపడును సామి సతినిఁగూడి.

## రసిక శరణాగతి

గీ. అర్చనము లారగింపులు నైన వెనుక
సామి దర్బారులో వెలచానసౌర
భళిరయని కన నల్లరు భరతనాట్య
మాడుదురు నిత్యమాంధ్రనాయకుని యెదట

గీ. పండుగదినాలఁ దిరునాళ్ళ వాసరముల
నన్ని హంగుల నలరారి యమ్మురారి
వివిధ వాహన గతఁ [illegible]చు వీట నుత్స
వముల జనులకు నేత్రోత్సవంబుఁ గొలుపు

కం. దట్టమగు బొట్లు, జుట్లును
బట్టంచుల దోవతులును బలు జపమాలల్
దట్టిలుఁ జెలఁగ హరికడ
నెట్టనఁ జరియింత్రు పరమనిష్ఠుల విప్రుల్

లొడలొడ నర్చనల్ వడిసల్పి కానిక
లలరుచు లెక్కించు నర్చకులును
భక్తు లర్పించిన పదిసేర్ల తళిహలో
భాగించి కాఁజేయు పాచకులును
సమ్మార్జనక్రియల్ సరి జేసి ప్రమిదలఁ
జమురు పంచెదు పరిచారకులును
ద్రవిడ ప్రబంధ వేదమ్ములఁ దప్పొప్ప
గాఁ బఠియించు నధ్యాపకులును

౮. ననుదినమ్మును లెక్కలవ్యాయసరణి
వ్రాసి ప్రవ్యక్తము కాఁజేయు వ్రాఁతగాండ్రు
మచ్చికేవియు నచట లేరచ్చమైన
భక్తినొప్పెడు కైంకర్యపరులుగాని.

౯ వారిలో నెల్ల నతినీతివర్తనుండు
వేదవేదాంగ శాస్త్రసాగరమున
నాకళింపులు చేసికొన్నట్టి మేటి
సుందరుండగు నొక్క భూసురుఁడు వెలయు.

౧౦ విద్యలకెల్లను నెలవై
హృద్యముగా నొప్పుకతన స్ఫూర్తిని వానిన్
విద్యానిధియని పిల్తురు
విద్యాధికులైన సకలవిప్రవరేణ్యుల్.

సీ. వైదుష్య లక్ష్మి నపారంబుగాఁ గాంచి
తల్లిదండ్రు లెంతయుఁ జెలఁగుచుండ
ప్రకాశోత్సాహ చాతుర్యమున్ గని
పెద్దలు తలలూపి యద్దిర యన
స్మరుని మీఱఁగజాలు చక్కందనముఁ జూచి
మదవతులకు మదుల్ గదలఁబాఱ
సకల కృత్యంబుల సంతోషముగఁ జెంత
సహధర్మిణీత్వము జాయ నెఱప

గీ. మల్లె సంపెంగ జాజి చేమంతి పారి
జాత కుసుమాలు తులసియుఁ జక్కఁగొంచు
నాంధ్రనాయకు సన్నిధి కరిగి భక్తి
ననుదినంబు విద్యాసిధి యర్చ్చసేయు

కం. స్వామికి నీవిధి నర్చ్చలు
భూమిసురుఁడు సేయ నతని పొలఁతుక న.సీ
దామంబుల శ్రీకాకుళ
ధాముని సన్నిధికిఁ బంపు దయితునిచేతన్.

గీ. అతడు లక్ష్యాధికారిగాఁ దట్టటంచు
బీదవాఁడును గాఁడాంధ్ర విష్ణుపూజ
వలన్ని లబ్ధార్థములను నభ్యాగతులకు
నతిథులకుఁబెట్టు నానంద మతిశయిల్లి.

ఎక్కడ లేని చక్కదన మెక్కుడు పొందితి పిన్న పెద్దలం
దెక్కడ లేని గౌరవము పెందుని యందతిభక్తి మాటలో
నక్కఱదీర్చి మిక్కిలి సుఖాంబుధిఁ దేల్చెడు ధర్మపత్ని యు
న్నక్క యిఁకేటి లోటు వసుధామరుఁడింతటి భాగ్యశాలియై

కం. ఇక్కరణి జరుగఁగొ వెల
రొక్కపు వెలఁదు కల పెద్ద రాజపై కొసగన్
జొక్కమగు చదుఁ లేముఁగ
జక్కని తన కూఁతునంపె సంతస మొదవన్.

ఆ. వె. చంద్రరేఖరీతి జన్మించినప్పటి
నుండి వెల్గుచుండ నండజాక్షి
చంద్రరేఖయంచు సరితూఁగు నామంబు
పెట్టె దాని జనని ప్రేమమీఱ.

గీ. అదియుఁబదునాఱు వర్షముల్ పొదల నిండు
చందురునివలె వెలుఁగుచు నందమైన
మేనినిగనిగల్ గనువారి మానసములు
చూఱఁగొన వచ్చి సామి దర్బారునందు.

కం. సరిగమ పదనిస సనిదప
సరిగరి పదసాస్స యనుచు స్వరవిధులెల్లన్
సరిదప్ప కుండలాగున
తరుణీమణిపాటపాడె ధరరాల్గరఁగన్.

ఘలుఘలు మంచు నందియలు గజ్జెలు మ్రోఁగ విచిత్రరీతి మ
ద్దెలసుతి మేళముల్ పలుక ధిర్ధిర మండలవిభ్రమంబులన్
గులుకుపసిండి బొమ్మయనఁ గుల్కుచుఁ గోవిదులెల్ల మెచ్చ స
వ్యాలు చలనమ్ముమాని కన జోటి నటించె దశావతార

కం. ఆసమయంబున భక్తిని
భూసురపుంగవుఁడు పుష్పభూషితమాలా
భాసుఁడగు నాంధ్ర నాథుని
శ్రీసూక్తుల నర్చసల్పి చెన్నుదలిర్పన్.

సీ. నెఱకురుల్ గలదాని నిండుచుక్కలదొర
మురువు గేరెడు ముద్దుమోముదాని
వాలుఁజూపులదాని బలు సింగిణీ విండ్ల
సమతనొప్పెడు కనుబొమలదాని
మెఱుఁగు చెక్కులదాని మేలైన సంపెంగ
లకేఁజాలెడు నాస గలుగుదాని
చిగురు వాతెఱ దానిఁ జెలువవ్వగ్గలదానిఁ
గలకంఠములఁదోలు పలుకు దాని

గీ. గ్రులుకు గుబ్బలుగలదానిఁ గోమరుపాయ
మునఁ జెలంగెడు మైదీఁగ మొనయుదాని
సామి మోసాల నాట్యమ్ము సల్పుదానిఁ
జంద్రరేఖను గన విప్రచంద్రుఁడెదుట.

కం. కని దాని నాట్యవిలసన
మునకెంతయు మెచ్చి మోహమున మనమెనయన్
గొనబులగని యగుదానిని
ఘనముగ వర్ణింపఁదొడగె కసికని మతియున్.

గీ. కొమ్మపాలిండ్లు బంగారుగుండ్లు నిమ్మ
పండ్లఁబోఁజెండ్లఁ బొమ్మని పల్కు కరణి
కానవచ్చెడిఁ బైఁటలో, గళరవమ్ము
వీణియ నినాదమాధురి వెక్కిరించు.

సీ. కరములు మృణాళనాళముల్ గాను గగన
మరెరె పిఱుఁదుల యందమేమందు సైక
తములె పెన్దొడలనఁటి కంబములె తీవ
మెఱుపె యీకన్నె మెఱుఁగైన మేనుదీఁగ.

సన్నని మేల్ దుకూలమును జక్కని త్రైక ధరించి వేనలిన్
బొన్నలు జాజిపూల్ దుఱిమి పొల్పుగఁ గజ్జలరేఖఁదీర్చి వా
ల్గన్నుల దిద్ది నీల తిలకమ్మలికమ్మున నాట్యమాడు నీ
యన్నువఁగాంచఁ దోఁచె మరు నాఱవ బాణమనంగ నిత్తఱిన్

కం. కరముల స్వరములఁ జూపుల
మురిపపు నవ్వులను కొమ్మముడి భంగిమచే
నరుదుగ నర్థ స్ఫురణము
నరవిందదళాక్షి దెలియ నాడెను సౌరా.

ఎందఱొ వారసుందరుల నీయెడ నాడఁగ జూడలేదు వా
రందఱి యందు నొక్కరితకైనను నీచటనంపుసొంపు నీ
యందముచందమీతళుకునద్భుతగానకళావిశేషమిం
పొందఁగఁగాంచినామె భళి పొల్పుగ దీనికి నిద్దెయుద్దియౌ అ

తులకుమిటారి గబ్బిచనుగుబ్బ బెడంగులు బాహుమూలపున్
మిలమిల మేనిదీధితులు మొల్లని నవ్వులలోని వెన్నెలల్
కలికి నితంబబింబమున గంతులువైచెడి వేణితీరు నా
తలఁపున నిల్చి పొల్చెడినిఁ దాలిమిఁ బాపుచు నారెసారెకున్

కం. చెలి చిలుకరాతుసతియో
యలకేశ్వరుసుతుని కూర్మియతివయొ లక్ష్మీ
నిలయుని తోడఁ బొడమిన యా
నెలఁతుకయో లేక హొయలు నేర్పెటులున్నే.

గీ. ఇంతియా నొక్కొ రతనంపు దొంతిగాని
కలికియా నొక్కొ చిలుకల కొలికిగాని
బాలయా నొక్కొ మణిమయ మాలగాని
దీనికెనయగుదాని జగానఁ గాన.

కం. అని యీవిధి విద్యానిధి
యనితర మోహమున నుల్లమగ్గలికఁ గొనన్
జన మోసాల సమీపం
బున కాంధ్రేశ్వరునిఁ బాసి బుద్ధి గలంగన్.

కం. గర్భాలయమిటు వెల్వడి
దుర్భర మోహంబు మదిని దోల్ప నతఁడు ప్రా
దుర్భవమునందు మరుఁడన
స్వర్భవనసమానమైన చావడి నిలచెన్.

నిలచి యనేకభంగిమల నీరజలోచన సల్పు నాట్య కౌశలమును గాంచెఁ దన్మయత స్వాంతము రంజిల నంతలోన నా కలికి ముగించి నృత్యమతికౌతుకదృక్కులఁ దన్నుగాంచు పూవిలుతునిఁబోలు రూపరిని విప్రకుమారవతంసునిన్ గనెన్.

కం. కనుఁగొని యాతనిచక్రం
దనమున కాశ్చర్యమంది తనమదిలోనన్
వనజాతనేత్రి యీవిధి
ననుకొనెఁ బైపైని కోర్కులలముకొనంగన్.

కం. ఎక్కువగా నాపై నిఱు
మక్కువ దనమదిఁ, దలుమాడ్కిని చూడ్కుల్
చక్కగ విసిరెడు వీనిన్
దక్కనఁగా రాదెయంచుఁ దాపము మీఱన్

చెంపకుఁ జేరెడౌ కనులు, చెక్కులు నిద్దపుటద్దముల్, భళీ
కెంపును నొంపు మోవి, శశి గేలిసెయునర్చెడి మోముదమ్మియున్
సంపెఁగ వంటి నాసికయుఁ, జక్కని వీనులు, బాహుయుగ్మమున్
సొంపు గనంగొనన్ మదికిఁ జోద్యమునై కనుపట్టెనా కిటన్.

ఎగుభుజముల్ విశాలమయి యెత్తగుఱొమ్ము మతి సన్న నౌచు తీ
రుగ నెసలారుకొను మరు రూపేగ పోయుగమందు గెల్వఁగాఁ
దగిన స్వరూపసంపద నుదాత్తగభీరతఁ జాటునౌర నా
దగు మెలజవ్వనం బితని యక్కునఁ జొక్కనఁగాదె సార్థమా.

ఆ. వె. నన్నుఁగన్నతల్లి కన్నతీకమ్ముకై
వన్నె చిన్నెలెన్నొ యున్నవారి
నిన్న మొన్న సెన్ను చున్నదిగాని యీ
వన్నెగానివంటివానిఁగాన.

కం అని యిటు వనితయు వానిన్
వనితనునాతండు మదుల వర్ణన సలుపన్
దనతోడివారు దేవళ
మునపై వేద్యంపుగంట మ్రోఁగించిరొగిన్.

ఆ. వె. ఆరగింపుగంట యతనివీనులసోక
నుల్కిపడుచుఁ గల్కి చిల్కఁగనుట
మాని లోనికేగ మదిసంభ్రమింపఁగ
స్వామిపనుల వేగఁ జక్కఁబఱుప.

గీ. అరిగి దండప్రణామముల్ హరికిఁ జేసి
కడమవారలతో నటఁగల్గు పనుల
నెల్ల సల్పుచు నెడనెడఁ బల్లవోష్ఠి
గనఁగ నడయాడు ద్వారమ్ముకడ నతండు

కం. చెలిఁగాంచుఁ గాంచి యచ్చటఁ
గలపెద్దలు దన్నుఁగాంతురని తలవంచున్
జెలియెడఁ బలుప్రీతియుఁ బె
ద్దలయెడ భీతియును బొదల విద్యానిధి తాన్

గీ. అతివనతఁడు చూడ నతివయుఁ దలవంచు
నతివ యతనిఁజూడ నతఁడుగొంకు
నతివనతనిఁగూడ నతనుఁడు గురుతించి
చూపుచూపుఁగలువఁదూపువిడరె

కం. క్రమముగఁ దీర్థము శరకో
పముఁ బుష్పము తులసి మఱియు భక్ష్యాధికముల్
కమలాక్షు ప్రసాదములన్
సమముగ భక్తాళికిచ్చి స్వాములు పిదపన్

గీ. ఆలయముపుఁదల్పులను మూసి యవల బీగ
ములను వైచియు జనులతో ముదమువీఱ
నిండ్లకేగఁగ భూసురుఁడింతియుఁజనెఁ
బ్రేమదృక్కుల నొండొరుల్ ప్రీతిఁగనుచు.

భూసురుఁడింటికింజని యపూర్వపుఁజక్కఁదనాలకిక్కయౌ
భాసురగాత్రి నెంచుచు నెపమ్ములనాత్మసతిన్ విదల్చుచున్
మూసుతుగాసిఁదూలుచు సమంజసమే యిదియంచు బుద్ధి నా
ధ్యాసమరల్పఁజాలక మహావ్యసనాకులితాంతరంగుఁడై

ఆ వె. అప్పడములుం పప్పుదప్పళంబును జారు
కూర్ర వడియములను నూఱుఁగాయ
పెరుఁగు నేతితోడఁ బెట్టుచునన్నంబుఁ
గలుపుచుఁగసిగాటుగా భుజించెఁ

గీ. భోజన మొనర్చి పెరటిలోఁ బొన్నదరికి
నరిగి కూర్చుండి మదిలోన నంతకంత
కతను రంతుల సంతాపమతిశయిల్ల
నింతిఁ జింతించి చింతతో నిట్లుదలఁచె.

వారిదవేణి రాజముఖి పద్మదళాక్షి యుఁబల్లవోష్ఠి శృం
గారరసంపురాశి దరకంఠి లసన్మకురాభగండయున్
జారుమృణాళబాహ సమచక్రయుగస్తని నిమ్ననాభి రం
భోరువు చంద్రరేఖకడకొద్దికఁ జేరుటయెట్లొ దైవమా.

తలిదండ్రులిల్ హితకోటి బాంధవులు పెద్దల్ నేను హేలాగతిన్
వెలయాలింటికి నేగ నేమనెదరో వెయ్యేల యిల్లాలు నిం
ద్యులకున్ బెల్లుగఁ దల్లడిల్లదొకొ, యుద్వోశంక బాధించెనా
చెలినన్నున్ మదిఁగూర్మి భావలహరిన్ జింతించునే యింతకున్.

సరసిజనేత్రి దానిసరిజట్టున నేగుచు హాసరేఖతో
సరసవిలాసముల్ పొదల సారెకు నన్ దిలకింప నల్లె నే
నరుసము జెంది తన్నుఁగన నల్లన మోమువంచి సిగ్గుతోఁ
బరవశతన్ ననున్ గనుట పర్విడెనాసలు మానసంబునన్.

గీ. రొక్కమిచ్చువాఁడె నిక్కంపుఁబ్రియుఁడంట
వేశ్యకాములకు వెలఁదియట్ల
దలఁచెనేని నాదుకలధనంబంతయు
గ్రుమ్మరించి యేలుకొందు దాని.

కం. ఎదియెటులైననుగానీ
ముదమున మదిరాక్షిఁ గదిసి ముద్దులు గొనుచున్
మదనుని కేళిం దేలక
మది తాళదటంచు మించు మమత దలిర్పన్.

ఎప్పుడు దేవళమ్మునకు నేగుదుఁ గన్నులుత్రృప్తిఁ బొంద నే
నెప్పుడు చంద్రరేఖము ఖహేలలు గందు నటంచు భూసురుం
డెప్పటికన్న మున్న జగదీశ్వరపూజకు నేగి ధ్యానమున్
దెప్పలపై మనమ్ము శశిరేఖకు పై ననుసామెతిన్ బలెన్.

పనులనుదాసి కార్యములవట్టునమంతిరి భక్తిపట్ల మా
తను క్షమలో ధరిత్రినిసదా శయనంబున రంభ రూపమున్
దున రమ్మ మించి తోఁచు సతి దోఁచెదృణాతిత్రుణమ్ము భాతి నై
పుత్రినకు నిచేగదా ధరణిఁగొల్వఁగఁ గామకచిత్తవృత్తముల్.

అవనిసురోత్తముండిల నాలయసీమకు నేగి దేవునిన్
దపిలి నుతింపభక్తిపరతన్ జనుదెంచిరి యొక్కరొక్కరై
భవహరుసర్చకుల్ మొదలుపాలనకర్తయు దేవదాసి చం
ద్రవదన తక్కుఁగల్గహరిలాలువ యంతయు బాదచారులై

కం వచ్చినపరిజనమంతయుఁ
జెచ్చెర తమవిధులనెల్లఁ జేయఁగ విప్రుం
డచ్చపలాక్షినిఁ గాంచుచు
విచ్చిన పుష్పాళినాంధ్రివిభునర్చించున్.

సీ. వికచపద్మమ్ముల విష్ణునర్చించుచుఁ
గలికి లేనవ్వు మొగమ్ము నెంచుఁ
గలువరేకుల రమాకాంతుఁ బూజించుచు
నెలఁత వెడందకన్నులను నెన్నుఁ

జంపకమ్ముల నాంఘ్రిశౌరినర్చించుచు
సకియ మనోజ్ఞనాసికను దలఁచు
మల్లికాదామముల్ మాధవు మెడవైచి
కామినీదరహాసకాంతి నెన్ను.

గీ. భక్తి ఫలముల స్వామికి భక్తులీయ
బాలపాలిండ్లఁ దలఁచుచుఁ బట్టిచూచుఁ
దనువు దేవునికడఁ దనమనసు వేశ్య
యెడల వర్తింపఁ దహాతహాపడుచునతఁడు.

కం. ఆపగ రాని మనోభవ
తాపంబున డస్సి విపరీతపయుండెపుడున్
దాపునకున్ జనిచని భావముఁ
జూపులఁ జేష్టలను వారసుదతికిఁ దెలుపున్.

సీ. శ్రీశఠారినొసంగఁ జెలికేలు మోడ్చినఁ
గేలు మోడ్తును జెలి యేలుమనను
దులసిపుష్ప మొసంగి తులలేనిభోగమ్ము
లెపుడంచుఁ దిన్నఁగా నుచ్చరింపఁ
దీర్థమ్మునిడి చేత సార్థమ్ము నాజన్మ
నీదయ రా ననునాదరమున
విని యోగముంచుసాకునఁ గరాంగుళులను
నొక్కుచు నెక్కువ మక్కువఁగొను

గీ. నీవలావలఁజనుచు నామె మ్రోలాఁడి
ప్రక్కగా నేగుఁ బనిలేనిపనులతోడ
హృదయమునఁ బొంగువలపున నదనుచూచి
యెవరు గనరంచు వినరంచు నెదఁదలంచి.

కం. ఇవ్విధమున నెవ్వేళల
నవ్వోలఁదుక రతికిఁజిత్తమందున నాతం
డువ్విళ్ళూరుట గని యది
నవ్వుచు సమ్మతిని మదిని నాటినప్రేమన్

కన్నెలోకమునకై యెన్నోవజ్రములిచ్చు
మారువాడిని మనసారఁద్రోలి
ఒకసారిమాటాడ నొకవందయిచ్చెద
ననువాని నవలీల నవలఁద్రోచి
కన్నెత్తినన్ జాలుఁ గనకాభిషేకాల
నొలికింతుమను వర్తకులను వదలి
యాటపాటలనెల్ల వర్జించి చీరెడి
గుడియధికారులఁ గూడ విడచి

గీ. యాదినుండియుఁ దనుఁ గోరు నందగాఁడు
తన్నుఁ గోరుచునుండు విధమ్ముఁ గాంచి
మెచ్చితలయూచి మది ముదమెచ్చ విప్ర
చంద్రిక గలయ సంకల్పించి చంద్రరేఖ

నెగ్గు మనంబునీవయిని కాయజసుందర రమ్ము వేగ నా
పొద్దకుఁ గ్రొద్దుగుఱ్ఱిఁకఁగనె యొద్దికఁ దూగుపునీథిలోనఁ బ
న్నిద్దపుటద్దముల్ గలిగి నీటుగనొప్పెడు మేడమాడి యుం
డెద్ది తలంపఁబోవక హృదీప్సితసిద్ధిని నందుఁబొందవే

క౦ అనికమ్మ వ్రాసి సఖిచే
తను బంపఁగ నదియు నేగి గిరధారికిఁ బూ
జను సల్పి వచ్చు వైష్ణవుఁ
గని దండముఁ బెట్టి చేతికమ్మనొసంగన్

గీ. పెన్నిధినిఁ గన్నఁగొను నిఱుపేద కరణి
నుబ్బి గొబ్బున దనమీఁద నున్న సరిగ
శాల్వఁ బసదనముగ నిచ్చెఁ జంద్రరేఖ
లేఖఁగని మది సంతుష్టి లేఁగ నతఁడు

రసికత మీఱఁ బ్రేమమున రమ్మని వ్రాసిన కమ్మఁగాంచి సం
తసమున వైష్ణవోత్తముఁడు తామరసాక్షుప్రసాదమాల్యముల్
బిసరుహనేత్రికిమ్మనుచుఁ బ్రీతిగ నచ్చెలిదాసిచేత నిం
పొసఁగఁగనిచ్చి యంపెఁ జెలిపొందువసుందని నందితాత్ముఁడై

అటులా దాసినిఁ బంపి విప్రుఁడెదలో నాహ్లాదమున్ బొందుచున్
బటువేగంబున నింటికేగి యట సాపాటున్ దగన్ సల్పి యం
తటనూర్యుండిఁకఁ గ్రుంకు టెప్పుడొకొ యస్తక్ష్మాధరంబందుఁగ్రుం
గిట బాలన్ గదియించి ప్రీతి మెయిఁ గౌఁగిళ్ళందుటింకెప్పుడో

అని తలపోయుచుండఁగ సహాస్కరుఁడల్లన బశ్చిమాద్రికిన్
జనియెఁ బసల్ శకుంతములు చల్లఁగ నిండ్లను గూండ్లఁ జేరె సం
ధ్యను దగ వార్చి విప్రుఁడు రయంబున నర్చనకేగె నాలయం
బు నఁగలశాంగిపైఁ బోలచేఁ గోడిమిఁ జందురుఁడు రిక్కగుంపుతోన్

ఆ వె
ఆలయమున హరికి నర్చనాదిక్రియల్
సరభసమున సలిపి చంద్రరేఖ
రతికి వచ్చె రతిని వాదకేడియతనుని
భాతిఁదోఁప సానివాడకతఁడు

ఆ. వె
సానివాడలోనఁ జక్కనియద్దాల
మేడ దరియఁగాంచి మెల్ల మెల్ల
మెలఁత వచ్చి యతని మెడలోనఁ గుసుమాల
మాలనిడుచుఁ గేలుఁగేలుఁగలిపి

తోఁకొని పోయి తల్పమునఁ దోసముతో వసియింపఁజేసి నా
నాకమనీయవాసనల నవ్యతమంబగుగంధసారమున్
వీఁకనలఁదించి కప్పురపువీడ్యమొసంగ గ్రహించి భూసురుం
డాశమాలాక్షి మోవిఁ దనివారఁగ నాని కుచమ్ములంటుచున్

గీ.
హస్తములకెక్కుడౌ నీపరీక్ష స్తములగు
తులుకుగుబ్బలటంచని కలికి చనులఁ
బట్టుకొన మోహమునఁబవంచి పణతినిలచె
దరుముకొని సురుసిగ్గు దొంతరలు దొరల.

కం. తలవంచి లజ్జపెంపునఁ
జెలి నిలచుటగాంచి యతఁడు చెంప నిమురుచున్
వలకేలఁ బోఁతికొనున్
వలనొప్పఁగఁ బట్టి యనియె వారనిప్రేమన్.

ఇమ్మగ రమ్మటంచుఁ గమలేక్షణ కమ్మను బంపి దూతిచే
నిమ్మెయి సిగ్గుతో నిలువనేటికి నేఁబెఱవాఁడనే భళీ
కమ్మనినీదుమోవి సుధ గ్రుక్కనగ్రుక్కకుగ్రుక్కనిచ్చుచున్
గమ్మని వింటిజోదునెఱకయ్యమొనర్పఁగదే తలోదరీ.

కం. అని యనువున నక్కామిని
నెనరొప్పఁగ సెజ్జఁజేర్చి నేర్పున ననరుల్
గన గొని స్పృశించు వేడుక
మనమున వేగిర మొనర్ప మదనాతురుఁడై

సీ. పద్మమా యమృతంపుసద్మమా యని తమి
మోముమోమునఁ జేర్చి ముద్దుఁ బెట్టి
వగఁగుల్కు పగడమా సొగసైన బింబమా
యిదియని మొనపంటఁ గొదవి నొక్కి
బంగారుకుండలా రంగారుచెండులా
యంచు గుబ్బల గోరులుంచి యుంచి
సైకతశ్రేణులా స్యందనాంగమ్ములా
యని పిఱుందులు హస్తమున స్పృశించి

గీ. అందమగు నీదు యౌవనోద్యానమందు
విరిసి విరియని వన్నిరు విరివొ యిద్ది
యంచు మరులించు నతనుగేహమ్ముఁజేరి
చేలఁదొలగించి మరుకేళిఁదేలెనతఁడు

కం. ఆతటి నాతియు నాతఁడు
చేతోభవప్రకీర్ణసల్ప చెల్వము నెదుటన్
బాతిన ముకురమ్మునఁ గని
చేతమ్ములఁ బ్రీతి హెచ్చి చెలిమి దలిర్పన్

గీ. చెలియ యేవిధి నేర్చెనో తెలియరాదు
బ్రాహ్మణునితోడఁ జౌసీతి బంధయుక్తి
సమతఁబెనగెచు బ్రియుఁడు తోసమున మెచ్చ
నిరుఫురికి రాగముదయింప నింతిమెగద

నాటి కవుంగిలింతలును నాటియుపేకులు నాటిముద్దులున్
నాటి ఖలోక్తులల్కలును నాటి వినూత్నపు లేఁతనవ్వులున్
నాటి తనూవిలాసములు నాటి రతాలఁగళల్ గరంచుటల్
నాటిసుఖమ్ములెల్ల నలనాతికి నాతనికే యెఱుంగనౌ.

ఈగతెవలేని కూటముల నింతియుఁ గాంతుఁడుఁ బూలపాన్పుపై
దిటవెసలారఁ గాలపరిధిన్ గమనింపక యొండొరుల్ కౌఁ
గిట నొకటాచు మన్మథుని కేళినిఁదేలుచు నెప్డు కూర్కిరో
స్ఫుటగతిఁదోచె వెల్గులల పూర్వదిశన్ నిసిమెల్లజారఁగన్.

వెలవెలబాఱె రేవెలుఁగు వేడ్క విహంగము పాఱె మేఁతకై
కలకలమంచుఁ బాఱె గిరిగహ్వరభూములఁ గాఱెఁ జీఁకటుల్
తెలతెలవాఱె భూసురుఁడు దిన్నగ నింటికిఁ జాఱెఁ దూఁగు నన్
జలజహితుండు సేరె జలజమ్ముల తోసము మీఱ నత్తఱిన్.

చని తానంబొనరించి విప్రుఁడు వెసన్ సంధ్యాజపంబాది క
ర్మను సంపూర్తిగ సల్పి నవ్యసుమమాలిన్ గొంచు నాంధ్రేశు భ
క్తి నియర్చించుచుఁ జంద్రరేఖ నటరక్తిన్ గాంచఁగా నాలయం
బున కుంబోమెగ తానుభూతులు మదిన్ బుట్టింపఁగా మాధురిన్.

అతివ తనూవిలాసముల నద్భుతనాట్యకళోన్నతిం గళా
వతి వదనేందు చంద్రికలఁ బల్మఱుఁ గాంచుచు నించు విల్తుచే
మతులు చలింప నట్టిమతిమంతులు లేరొకరైన నౌర యా
తత సుకృతమ్మునన్ ద్విజుఁడు దక్కఁగొనెన్ ధర దానిభోగముల్

వరుసన్ బూజపురస్కృతుల్ బహుళసేవాకాలనైవేద్యముల్
నిరతిన్ భక్తులధర్మసేవలవలన్ నీరాజనంబిచ్చి శ్రీ
హరినిర్మాల్యసుమప్రసాదముల మోహభ్రాంతితోఁ జేరి భూ
సురుఁడిచ్చున్ దనవంతువచ్చినవి యచ్చోనున్న యజ్ఞాంశికిన్.

చక్కని వారిలో మిగులఁ జక్కనియాతడు నందగత్తెలం
దెక్కడ లేని యందమున నెక్కువ నాతియుఁ బెక్కురీతులన్
మక్కువఁ జిక్కఁ జొక్కఁగని మానసవీథులఁ బొక్కుచుండ్రు ము
న్నక్కమలాక్షి చేఁగరము న్యక్కృతి నందిన వారలెవ్వరున్.

సీ. అధరమా సుమధురిమధరమా బింబమా
యాస్వాదనమ్మున నరయరాదె
చెక్కులా తేట సొంపెక్కినద్దమ్ములా
వరహస్తసంస్పర్శ నెఱుఁగరాదె
కుచములా దోరలికుచములా యియ్యవి
గోరఁ జీరక కనుంగొనఁగరాదె
పొక్కిలియా సుధగ్రిక్కెడు బావియా
తిన్నఁగా దరిఁజేరి తెలియరాదె

గీ. అందమా దేహమా యిది యిందు కాంతి
పుంజమా తెల్పవే దయఁ బువ్వుఁబోఁడి
యందగాఁడవు లే రసికాగ్రగణ్య
యనుభవింపుము రేయి నీకర్థమగును.

కం. అని నర్మోక్తులనాడుచు
మనముల మక్కువలు పెనఁగి మలయుచురా నా
ననములఁ జిఱునవ్వులొలయఁగ
వనితయు విప్రుఁడుఁ జరింత్రు శయనములోనన్

సీ. చల్లనిపూఁగోటఁ దెల్లని రేయెండ
మెల్లనిపిల్లతెమ్మెరలయందు
నెత్తైన మేడలో నెత్తావులెగఁజిమ్ము
మెత్తని సరిక్రొత్త మెత్తలందుఁ

చక్కని సోదరిండ్ల నెక్కొను మక్కువఁ
చక్కని పచ్చిక సొక్కులందు
చెలువమ్ములొ యూటకోలంకుల రేగెడి
జల్లను దూగరజల్లులందు

గీ. నాలయములోని ఖాళిజాగాలయందు
హాసముల కన్నుసన్నల హావభావ
విలసనమ్ముల స్వేచ్ఛతో విప్రవరుఁడు
చాన సుఖియింతురయ్యాయిసమయములను

నీకును నన్ సదారతుల నీరజనేత్రి గరంచుటెల్ల నా
పావనపూర్వపుణ్యపరిపాకమటంచని కాంతుఁడాడినన్
మావిభుఁగాఁదలంచి నవమన్మథ నిన్ రతిఁగొల్చుచున్న న
న్నీవిటునంట పాడియగునే యనుఁ గాంతయు శ్లేషనొప్పగన్.

చెలిపై నెంతతమిన్ జరించినను లక్ష్మీకాంతుపై భక్తి సం
ధ్యాలనిష్ఠారతిసల్పుసత్క్రియలు సద్ధర్మంబుపై రక్తియున్
దొలఁగన్ జేయక డెందమందున జనస్తుత్యుండునై వర్తిలున్
గలగంబాటిన జాహ్నవీజలమనంగా విప్రుఁడక్కోటిలోన్.

గీ. ఇద్దియిటులుండ నా నేలనెల్ల నేలు
సుమతియనుపార్థివోత్తముఁడమితబలుఁడు
కామకేశ్వరు వీక్షించు కాంక్ష వచ్చె
సతుల సుతులను బంధుల హితులఁగూడి

తురగములున్ గరీంద్రములు దోరపుఁదేరులు వీరసైనికుల్
పరిచరముందు వెన్కలను దత్పరతన్ జనుదేర శ్రేష్ఠమౌ
హరిపయినెక్కి వచ్చెడి ధరాధిపుఁగాంచఁగ గుంపులౌచు స్త్రీ
పురుషులు సేరవచ్చిరియు మూలల రచ్చల వీధివీథులన్.

కం. ఈవితరణ భోగంబుల
శ్రీవిలసితశౌర్యములను శ్రీసుండెయగున్
నావిష్ణుఃపృథివీపతి
నా వినమె శాస్త్రసూక్తి నయవిదులనఁగన్

కం. అని తనుఁగనుఁగొను జనతతు
లనుకొనిమనములను మిగుల హర్షించి కనన్
జనియెను మన్నీఁడాలయ
మునకున్ శుభతూర్యారావములు చెలువందన్.

అటుచని మేదినీమఘవుఁడచ్యుతునాలయగోపురమ్ము ముం
దట దనసైంధవమ్ము డిగి తత్పరతన్ బ్రణమిల్లి శౌరికిన్
భటచయమెల్ల తోనడువ బంగరువాకిళులన్ గమించి యం
తట నసలారు చిత్రమణిదర్పణమంటపశాలఁ జేరఁగన్.

అంతకుఁ గొంతముందు వసుధాధిపురాకను దూతమోమునన్
సంతసమార వించునటసాములు మొత్తము నేకమై ధరా
కాంతునెదుర్కొనన్ జనిరి గ్రక్కున నంచితగౌరవమ్ముతో
స్తుతములనాలసింపక వచోమధువీచులు జాలువాఱఁగన్

సీ. ఆకర్షణీయమై యలరారు మోమున
నూర్ధ్వపుండ్రద్యుతులొప్ప గుల్క—
ధగధగ మెఱయుచు ధవళిమ వెదచల్లు
జందెము భుజసీమఁ బొందుసేయ
శ్రీకారములవలె జెలఁగు వీనులయందు
ముత్యాలచౌకట్లు మురువుఁ గావఁ
దులకించు కటిసీమఁ దోరంపుజలతారు
ధోవతికచ్ఛలు రేవదూఁగ

గీ. రాగిణికి నిడఁబోవు నిర్మాల్యసరము
లచటనేయిడి నగుచు విద్యానిధియును
యాజకులమధ్య మెఱయుచు నరుగుదెంచెఁ
దారకలలోన నలజలజారి పగిది

కం. కరుణను దర్శనమిడ నా
హరి మూర్తి ధరించివచ్చెననఁగా దరికిన్
దరిసెడివిప్రకుమారునిఁ
గరమను రాగమున ధరణికాంతుఁడు గనుచున్.

కం. ఔరా యీభూసురవరు
సారును దీరుం గనంగ సంతసమగు నీ
ధీరకుమారుం గాంచిన
వారిభవంబెంత యర్థవంత మొయను చున్.

ద్విజులార సేమమే దివ్యమామిారయేలు
బడిన సేమమెమాకుఁ బార్థివేంద్ర
హరిపూజలకు నెద్దికొంతగల్గక యున్న
కొంతలేదెయ్యది ధరణినాథ
సక్రమంబుగఁ బరిచారకుల్ నడతురే
వరదుఁడందఱిసామి వసుమతీశ
చక్రికిఁ దిరునాళ్ళ సాగునే యేటేటఁ
జక్కఁగాఁజరుగును జనవరేణ్య

గీ. తనులపండువుగాఁగ శ్రీకాకుళేశు
వైభవంబునుఁగన భవతాపమడఁగు
దివ్యవిగ్రహు శ్రీయాంధ్రదేవుఁ గాంచ
నరుగుదెమ్మిఁక లోనికి నవనిపాల.

కం. అని యుచితభాషణమ్ముల
ననునయమున నల్పినంత నర్చకులవనీ
శుని ముందు నధికతరమగు
వినయమ్మున నిలిచి నృపునిఁ జేరిమితోడన్

వె. రమ్ము సార్వభౌమ రారమ్ము రిపుభీమ
రమ్ము కీర్తిధామ రాజవంశ
వార్ధిసోమ రమ్ము వచ్చి యాంధ్రేశు సే
వించుమంచితముగ మించసిరులు.

అని కొండాడి నృపాలుఁడోడ్కొనుచు వారత్నాంతపాగారవం
బున నాంధ్రేశ్వరు సన్నిధానమునకున్ బోల్పొందగాఁ జేగ శ్రీ
ఘనహారాంచితవక్షుఁ బీతవసనున్ గల్యాణగాత్రున్ హరిన్
గని ప్రీతిన్ మను జేశ్వరుండలఁతిపుల్కల్ గ్రమ్మఁగా యమ్మనన్

కం. స్వామికి వలసినవన్నియు
సాములు నెఱవేర్పెడనుచు సంచుల మొహరీ
లా మహీకాంతుఁడు వైశమ
శ్రీమహీశేశునకు నొసఁగి చిప్పిలుభక్తిన్

కం. కరములు మొగిడిచి కన్నుల
జరజర సమ్మోదభాష్పఝరి జాల్వాఱన్
నిరవధిక నిరంజన పద
సరసిజముల కెఱఁగి నిలిచి సన్నుతి సలిపెన్

శ్రీకర దేవదేవ విధుశేఖరవంద్య కృతిస్తుతిప్రియా
పాక విరోధివైరి బలభంజన భక్తజనావనా కృపా
ద్యాకర ఘోరవిస్తరభయాపహరా యఖిలాండకోటి బ్రహ్మాం
డాకర కేలు మోడ్తు వరదాయక ప్రోవుము యాంధ్రనాయకా

అని రాజేంద్రుఁడు పల్ విధమ్ములను శ్రీయాంధ్రేశునిన్ మానసం
బునఁ బ్రార్థించుచు నిల్వఁ దీర్థ తులసీపుష్పమ్ములన్ శ్రీశఠా
రిని భూపాలునకిచ్చి పూజకుఁ నీ రేజాక్షునిన్ గాంచ వ
చ్చిన రాజాత్మజబంధుభృత్యులకునున్ శిక్షించుగా నిచ్చుచన్

కం. చక్కెర పొంగలి మొదలగు
చక్కని వివిధ ప్రసాదచయములు వరుసన్
మిక్కిలి మక్కువ నెక్కొన
నొక్కొక్కరి కరములందు నుంచిరి బ్రీతిన్.

కాని మనుజేశ్వరుండతనికూరిమి రాణులు బంధువర్గముల్
మనములనుత్సహించుచు రమావరునిన్ గనులారఁ గాంచుచున్
జనఁ జరణమ్ములాడక వెసన్ ధర సాగిలి మ్రొక్కి కాంచుచున్
దనియక యెట్టకేలకు బదంపడి కోవెల నిర్గమించుచున్.

సీ. నీరదనిభగాత్రు నిర్మలచారిత్రు
వరసుందరాకారు వనధిధీరుఁ
గంజాతనయను రాకాచంద్రవదను ర
మావిలాసు మనోజ్ఞమందహాసు
కరికరకరు లసత్ గ్రైవేయధరు సువి
శాలవక్షుఁ బ్రపన్నజాలరక్షు
రాజీవచరణు నిర్వ్యాజదయాచణు
బ్రహ్మాండభరణు దురాత్మహరణు

గీ. రాజ్యలక్ష్మీమనోహరుఁ ద్యాజ్యదూరుఁ
గామితార్థదు వనమాలి శ్రీమదాంధ్ర
నాథు విడలేక కాంచి భూనాథుఁడచటఁ
గొంతకాలము నివసింపఁ జింతచేసె.

గీ. తలఁచెనో లేదొ ఱేఁడు సౌధములు దొడ్లు
వాటమైన నివ్వటిలు కేళివాటికలును
గొలువుకూటమ్ములటనొప్పఁగోరినట్లు
కలిమిగలవారిసంకల్పములను వృథయె.

సీ. ఏవేళ కేయాజ్ఞ లిడునొ భూధవుఁడని
భయభక్తులను వీరభటులునిలుపఁ
దమనాట్యకౌశలత్వముఁ జూపి మెప్పింప
వారసుందరులొకవార జేరఁ
గప్పంబులర్పించుకాంక్షతో సామంత
రాజులింకొకచక్కి రాజిలంగ
సార్వభౌమునికన్నుసన్నల రాజ్యాంగ
తంత్రముల్ వకిక్కన మంత్రివరుప

ఆ. వె. నగరియందుమాడి నరనాథుఁడచ్చట
సకలవైభవములు జరుగుచుండఁ
దనదువంశమునకుఁ దగనిలవేల్పు నా
నాంధ్రవిభుని గాంచి యలరుచుండె.

జనవరుభార్యలిద్దరు నజస్రము సందెలఁ బూయుపూవులన్
గొనకొని కోసి దండలుగఁ గూరిచి శౌరికి బత్తిమీఱఁ బం
పినఁ గొని యర్చకుల్ వారికి వేడుకతోడ నలంకరించి పొ
ద్దున సడలించిపంప నవి తోయరుహాక్షులు దాల్తురెంతయున్.

కం. హారినిర్మాల్యంబిట్టుల
పరుసగఁ బ్రతిదినము రాణివాసముఁ జేరన్
గరమనురక్తిని వేశ్యా
వరవర్ణినిఁ దలఁచి విప్రవరుఁడాతురతన్

ఆ. వె. మొన్న మొన్న దనుక యెన్ని యోహారిమాల్య
ములనొసంగుచుంటి నేఁటికకట
యిప్పుడట్టులొసఁగ నిబ్బందిగలిగెను
నంచుఁ జాల ఖేదమంది తుదిని

ఆ వె. నేటినుండి కరముసీఁగా నప్పటి
కప్పుడె విరియునట్టి యరవిరులను
సకియకంపి వాని సందెలఁదలఁదాల్పఁ
జెల్లవారుసరికిఁ దెత్తునిటకు.

అని విద్యానిధియెంచి నిత్యమును సంధ్యావేళలన్ మాధవా
ర్చనఁ గావించిన వెంటనే విరుల వేశ్యావేణియందుంచి రే
లను దద్భోగములంది వేకువన పూలన్ వెండిగొంపోయి దే
వునినిర్మాల్యములంచు రాణులకునంపున్ శంక లేకెంతయున్

రాగాలాపమనోజ్ఞహాసరుచులన్ రమ్యంపుఁగేళీకళా
భోగ శ్రీఘనవైభవమ్ములను నాభోగంపుటిల్లాలికిన్
రాగస్ఫూర్తిఁదనర్చు విప్రుఁగని యోర్వన్ లేనిచందాన నే
లాగో వెంటుకవచ్చెనాతఁడిడుపూలన్ గూడి రాట్ స్త్రీలకున్

సొక్కులతోడఁ జూడఁగడు సన్నగ జారుచుఁ జేత దీర్ఘమై
చక్కని తేఁటిరెక్కవలె సౌరునసంగు వినీలకేశమున్
వెక్కసపాటుతోడఁ గనువేదురునందఁగఁ గాంచి తాణుల
మ్మెక్కయటంచుఁ గోపమున నావిరులిచ్చిన భూసురోత్తమున్

కనుఁగొని యీ శిరోజమెటు గల్గెను బూవులలోన విప్రనీ
మనికి యెఱింగి యున్నకథ మాదరిఁ బల్కుమటంచుఁ బల్క నా
యనఘుఁడదేమొ నేనెఱుఁగ నక్కట యర్చకముఖ్యుఁడే విగన్
పనివడి యిచ్చి పంపఁ గొనివత్తును మీకునొసంగ నిత్యమున్.

కం. నావుడు రాజ్ఞీద్వయ మా
హా విప్రవరేణ్య మంచిదాతనినిపుడే
నీవరిగి తోడి తెమ్మనఁ
గా వగచుచు భూసురుండు గ్రక్కునఁజనియెన్.

చని పణ్యాంగనరూపరేఖల లసత్సౌందర్యమూహించి త
జ్జనితామేయవిమోహతన్ హరికి నర్చల్ సేయుచున్ భక్తి వ
చ్చిన యాత్రార్థుల నెల్లఁ జేరి వరదున్ సేవింపఁగాఁ జేయు నా
ఘను విద్యానిధిఁ గాంచి సర్వమునెఱుంగన్ జేయఁగా నంతటన్.

కం. దడదడమని యుల్లము మ
ల్లడిఁగొన నాలించి కరిము లజ్జించుచు నా
తఁడు గుడి విడి శిష్యుని వెం
బడిఁబడి చనుదెంచె రాజపత్నుల యాజ్ఞన్.

పచ్చని పట్టుపుట్టమున భాసితవిగ్రహుండై ధరిత్రికిన్
వచ్చి పచ్చవింటిదొరిభాతిప శిష్యుని వెంటఁ జెచ్చెరన్
వచ్చి శిరమ్మువాంచి నిలువంబడు బ్రాహ్మణు రాణు లెంత యున్
వెచ్చని ప్రాపుఁజూచి పరుషీకరభాషలఁ బల్కె వివిధన్

ఏమీ బాపఁడ మంచివాఁడవని నిన్నే ప్రొద్దు భూమీశ్వరుం
డేమెమో వదియించి మెచ్చుకొను నీ యీచందమీక్షింపఁగ
నే మాకియ్యెడ నీదు బైసి దెలిపెన్ నిక్కమ్ముగాఁ దెల్పు మే
రామల్ రాత్రిలఁ దాల్తురీవికులఁ బూజల్ సేయకే శౌరికిన్

హరికిన్ మేమతిభక్తిఁ బూజకయి పుష్పాళిన్ సమర్పింప నీ
వు రమానాథునకర్చసల్పక వియేపూఁబోండ్లకో యిచ్చి వా
రు రహాన్ రేలధరించి తీయఁ గొని దుర్మోహమ్మునన్ నిత్యమున్
హరినిర్మాల్యములంచు మాకిడెదవాహా తెంపుతో ఛీ ద్విజా

కం. బెల్లముగొట్టిన శిలవలె
నల్లసతలవాంచి నిలువనేనే యిపుడీ
నల్లని వెండ్రికకేమనె
దుల్లముడి కెడిని నుదువుమున్న చరిత్రన్.

ఆ. వె. రాజశాసనంబులఁ ఘ్యంబు నెవ్వని
కేని యంచు నెఱుఁగవే మొ నీవు
తప్పిదంబు గల్గఁ దల నిల్వదిలపైని
హితులకైన నాత్మసుతులకైన.

అని రాజ్ఞీద్వయమాడ విప్రుఁడెదలో నల్లాడుచున్ నిల్చి యే
మనఁగా నేరక మొండిధైర్యమున హాసాస్యమ్ముతో వెంబ్రికన్
గని సాధ్వీమణులార నేఁబనిత్వరన్ గంజాక్షు నిర్మాల్యమున్
గొనఁ జిక్కంబడి యూడివచ్చె నిది మీకున్ గోపమిప్పటికిన్

గీ. ఆంధ్రదేవుని సికయందు నందమందు
చుండు నీలాలకముగాని సుదతులార
యెవ్వరిదియును గాదు సుమ్మింత గనుఁడు
ఒరులకురులెన్నడైన నీ హొయలు గనునె.

గీ అంతరంగిక భక్తులై యలరు మిమ్ము
ధన్యతములఁ జేయ మాధవుశిరోజ
మిట్లు చనుదెంచెఁ బూలతో నిలను మిమ్ముఁ
బోలుగరితలు నహా కోపమేల యహాహా.

భూసురుఁడిట్లీధంబున నపూర్వప్రవృత్తముఁదెల్ప వారు బల్
తోసమునంది మోద్భటులు తోయరుహాక్షుతలన్ శిరోజముల్
భాసిలఁగాన మెప్షు భ పండుగ మానుకృతంపురాసులో
భూసురవర్య చూపెదవె పొల్పగు కేశవు కేశపాశమున్.

కం. నావుడు కళవళపడి యతఁ
డో వెలఁదుకలార తాళుఁడొక్కించుక యా
దేవునిసికి దరిసింపం
గావలెననఁ దెల్పువాఁడ గ్రక్కున వినుఁడీ.

కం. హరికిన్ రేపరుదెంచెడి
హరివాసరమందు బహుతరార్చలు జరుగున్
తిరుమంజన మొనరు మతఁడే
నరుదెండెఱిగింతు నగయ హరినెటికుములన్.

ఎదియున్ దోఁచక భీతితోడుత నతఁడీరీతి భాషించి వా
రిదరిన్ వీడ్కొని నెమ్మనంబు పరమార్తిన్ గొంద నాంధ్రేశ స
త్పదరాజీవయుగమ్ము నెంచుచుఁ జనెన్ బ్రాఁబ్ధకర్మంబులన్
వదలన్ జాలని యోగ్యుఁడై వడిని శ్రీవత్సాంకునిన్ గొల్వఁగన్.

సీ. హరి శ్రీశ యీశ మాయనుఁగుఁబుత్రునిఁ బ్రోవు
మా యంచుఁ దలిదండ్రులడరి వేఁడఁ
పతిదర్శనమె తనపాలిభాగ్యంబని
నమ్మిన యిల్లాలు నెమ్మిగుంద
మారసుందర నిన్ను మాని నేమనఁజాల
నని వారసుందరి యనిశమార్వఁ
దగినట్టుజరిగె నెంతరసికత్వంబున్న
నంత వచ్చియ యని యహితులనఁగ

గీ. రేపు హరివాసరమ్మనఁ జూపునంట
చక్రిశిఖయని యచ్చటి జనులు పలుక
వింతకథయయ్యె క్షణములో విప్రచరిత
పట్టణంబున నీవార్త ప్రాకునంత.

వ్రీడయుఁ బాడియున్ దొరఁగి వేడుకతో వెలచేడెఁగూడుచున్
బోఁడిమి వేశ్యదాల్చి విడు పువ్వులఁదోడుకపోయి శ్రీహరిన్
బాగుచునర్చసేయ కటుపాపభయంబిసుమంత పొందకే
వీడునె పాపసంచయము వీని నటంచని కొందఱాడినన్.

ఆ. వె. చదువుకున్నవాఁడు జక్కనివాఁడర్థి
జనుల నాదరమునఁ దనుపువాడు
వీనినొసటనెట్లు విధి వ్రాసెనీవిధిఁ
గొందలమ్మనంచుఁ గొందఱనిరి

కం. తెలిసియొ తెలియకనో యిటు
సలిపితి నాతప్పిదమ్ము క్షమియింపంగా
వలెననక హరికిఁ దలపైఁ
గలదనెనట జుట్టు వెఱ్ఱిగాదో యకటా

గీ. అనుచుఁ గొందఱు వచియింప వినుచుఁ గొంద
ఱనిరి యెటువంటివాఁడు విద్యానిధియుఁ
సకలసద్గుణఖని తెల్గుసామి వీని
రక్షసేయును నిజము ప్రత్యక్షముగను

కం. పలువిధములఁ దనునిట్టులఁ
బలికెడు ప్రజలనుడి వినుచు బ్రాహ్మణుఁడెలమిన్
దొలగని భక్తిప్రపత్తిని
సలుపఁగ గుడికరిగి హరికి సాగిలి యంతన్.

సీ. ఎప్పుడుగనఁగొన్న నప్పుడే క్రొత్తలై
చక్షురుత్సవము నొసంగు వాని
నూపురమ్ములు దవ్వ రేపుమాపు నమర్చు
వరసుమరాసుల వరలువాని
సౌరభ్యమునకు సత్సౌరభ్యమిడి భువి
నతులమ్ములై నెగడందువాని
నడుగుఁదమ్ములఁ జాలనందమౌ శంఖచ
క్రాబ్జాది రేఖలనలరువాని

గీ. నఖిలభూమండలికి స్వామ్యులై నవాని
భూనభఃపరిమాతృకంబులగువాని
స్మరణమాత్రనఘమ్ములఁ దరుమువాని
నాంధ్రనాథుని దివ్యపాదాబ్జములను.

గీ. కాంచి శరణాగత త్రయకములివియని
యెంచి ద్వయమంత్రవరముచ్చరించు కొనుచు
దరిసి స్పృశియించి ప్రణమిల్లి దండ నిలచి
యార్తినిటు వేఁడె ముకుళితహస్తుఁడగుచు.

ఆ వె. ఓపురాణపురుష యోసచ్చిదానంద
యోయి చిదచిదాత్మ యోముకుంద
నమ్మికొంటి నిన్ను నాతండ్రి రాజ్యల
క్ష్మీశ ప్రోవుమయ్య యీక్షణమున.

వరదుఁడవంచు నిన్ విబుధవందిత వేదవిదుల్ బుధోత్తముల్
దిరముగఁజాటుచుంట విని దిగ్గన నే శరణార్థినైతి దు
ర్భరతర తాపమార్పఁగ భవత్కరుణామృతవారిధారలన్
బరపుమ నావయిన్ సొరుగుపై రుపయిన్ జలదంపుసోవనాన్

పుట్టినదాదివత్సలతఁబువ్వులలో విదిపెంచిపెద్దగా
నిట్టెయొనర్చి జీవితమునిచ్చినమాన్యులఁదల్లిదండ్రులన్
గుట్టుగమోసపుచ్చి తలకొర్వ్వున వేశ్యగృహమ్ముఁజేరునా
యట్టికుమార్గవర్తనుని నాశ్రితవత్సల యెట్లుప్రోచెదో.

సీ. ప్రాణాధికునిగ నన్ భావించు నిల్లాలి
నెంచక వేశ్యఁగామించినాఁడఁ
గామించి పెద్దలఁ గాంచక రేఁ బవల్
వెలయాలిఁ గూడుచు నలరినాఁడ
నలరి మీనిర్మాల్యముల భక్తులకు నీక
లియాటక త్తియకు ముసుగుంపినాఁడ
నంపి స్నాన జపాగ్నులందు నైతము వార
జలజాక్షుస్మరణమేసల్పినాఁడఁ

గీ. గడకుఁబణ్యాంగన ధరించి విడచుపువుల
మీదునిర్మాల్యమని తెల్పి మేదినీశు
వత్నులకు నిచ్చినాఁడ నాపన్నరక్ష
వారవారిజ దృక్ప్రేమహావార్ధి మునిఁగి

విడిచితి బాంధవావళిని విడిచితిఁబత్నిని దల్లిదండ్రులన్
విడిచితి వాసివన్నియల విడిచితి విడిచితిఁ బుణ్యపాపముల్
విడిచితి వేశ్యకై యకట విశ్రుత ధర్మములన్నిగాని నే
విడఁగజాల మీస్మరణ విడక నన్ గృపనోము శ్రీపతీ

ఆ. వె. పాల పొంగుఁబోలు పరువంపు మహిమచే
వెకలి నగుచు నాటవెలఁదిఁగూడి
చేయరాని తప్పఁ జేసితి నీగతి
నన్నుసైపుమో యనాథ నాథ.

ఇలమత్తేభపు కుంభముల్ చనులహా యేణాంక బింబంబు మో
మలబింబంబధరంబు నువ్వుఁబువె యాహా నాస యయ్యారె క
న్నులు చెంగల్వలె యంచు వర్ణనల నెన్నోరీతులన్ సల్పి నేఁ
గలినై రొక్కపుఁజేడెఁగూడి యిఁకదుష్కార్యంబుఁగావించితిన్

పరమదయార్ద్రులౌచు గురువర్యులు నాకిడినట్టి విద్దియల్
పరగఁగఁ గోతిచేతఁ బడిపాడగుచంపకమాలపోల్కి ని
ద్ధరణి నశించె దేవ యిఁకఁదావకపాదసరోజయుగ్మమే
శరణని నమ్మియుంటి సురసన్నుత ప్రోవుము తప్పులెన్నకే.

ఖలమతినౌచుఁ గామమునఁ గన్నులుమూసుక మీదుపూసఁగన్
వెలచెలి దాల్చి విడినవి వేడుకఁగైకొని ప్రత్యహమ్ము రా
ణులదరికంపుచుండ సుమనోహరవరా యొకపూలమాలలో
పల నొకనాఁడు నాయఘపుపంటయొనాఁగ శిరోజమొండురాన్

బెలుచన నల్గివారు పిలిపింపఁగ నేగి జవాబు వల్కఁగాఁ
గెలియక యొక్కతప్పు సరిదిద్దఁగఁ బోయిమఱొక్కతప్పుతోన్
సలిపెడులాగుదోఁచె విధి చక్కనిమీఁదుశిరమ్ముపైఁ గురుల్
గలవనియంటి వారలవి గాంచఁగవచ్చెదరెల్లి యేక్రియన్
సలిపెదొ దేవ శాకమునజామిలిఁ బోవఁగలేదె తొల్లి త
ప్పలనొనరించినన్ శ్రితులపోషణ సేతువిభేంద్రరక్ష దు
గ్ధలినమనోవికారుఁడను మందుఁడఁ బాపుఁడ భక్తితోడ నిన్
బలుకఁగలేని మర్త్యుఁడను బాలన సేయుము నీకృపామృతం
బెలమినిఁ జిల్కినావయి నరేశుకుటుంబమ యల్గెనేని నా
తల నిలువంగఁ బోవదిలఁ దావకమౌళివయిన్ శిరోజముల్
మొలవకయున్నఁగానమునుముందుగురుల్దగదాల్పుమయ్య శ్రీ
కలశపయోధిజాకుచనగమ్ములవాలుపలాహరాజమా
జలజభవేంద్రరుద్రముఖసంస్తుతవైభవ యాంధ్రనాయకా.

కం. నీనామము మననమ్మును
మానను మామానినీనమనమునను మనన్
నేనూనినా ననూనుని
నానాననునన్న నిన్ను నన్నూ ననినున్

పదచ్ఛేదః- నీనామము-మననమ్మును-మానను-మామానినీన-
మనమునను-మనన్-నేను-ఊనినాను-అనూనుని-
నానాననున్-అన్న-నిన్ను-నన్ను-ఊనన్-ఇనున్.

అర్థము - అన్న = తండ్రి (వేంకటేశా) మామానినీన_మా = లక్ష్మియనెడు; మానినీ = స్త్రీకి, ఇన = భర్తవైన వాఁడా. మనన్ = (నేను) బ్రతికటకొఱకు, మనమునను = మనస్సులో, నీనామము ను నమ్మను = నీ నామస్మరణమును, మానను = వదలను, నేను = నేను నన్ను = నన్ను, ఊను = రక్షించుటకొఱకు, ఇనన్ = ప్రభువైనవాఁడవును, నానానను = అనేక ముఖములుగలవాఁడవును అనూని = గొప్పవాఁడవైన; నిన్ను; ఊనినాను = ఆశ్రయించినాను.

గీ ఒక్కసారి నిన్ను నిక్కపుభక్తితో
శరణ మనుచు వేఁడు నరునినితర
భూతభీతిలవముఁ బొందనీయక ప్రోతు
నంటివిగద సల్పమయ్య దాని

కం, పంచమహాపాతకములఁ
గొంచక యొనరించునెట్టికూళయు నతిగా
వించుచు నీవాఁడననన్
మంచిగ రక్షింతువంట మఱవకుము హరీ.

ఇట్లు నుతియింప నెంతకు రమేశుఁడు వల్కక నిల్చియున్నసం కటపడి యర్చకోత్తముఁడెగాదిగఁగాంచి ముకుందపాదసం ఘటితకరాంబుజాతుఁడయి కన్గవ మూసి తదేకనిష్ఠతోఁ బటుతరభక్తితోఁ గరము ప్రార్థనసల్పఁ దొడంగె నీవిధన్

శ్లో॥ స్వామిన్ దయాపూర్ణ నమోనమస్తే
శ్రీమన్ క్షమాపూర్ణ నమోనమస్తే
భీమన్నమస్యార్య నమోనమస్తే
క్షేమంకరస్వార్చ నమోనమస్తే

-: దండకము :-

శ్రీకాళహస్తీశ నీదివ్యపాదాబ్జముల్ నాముదెందంబు నందెంతు శాంతమున్ దేవదేవా యమేయప్రభావా మహాదేవ సంభావితాభావనాతీత నీదివ్యగాథల్ వియత్కేశనాకేశనాగేశవాగీశవాణీశ - ముఖ్యామరుల్ సైతమున్ భావనన్ జేయలేరన్న నన్నన్న నిన్నెన్న నాకౌనె యాపన్నరక్షైకదీక్షా శుభజ్ఞాన సంపన్న సంయోగ కాంక్షా శ్రితార్తింకర ధ్వంసరూపా జగజ్జాల జన్మస్థితిధ్వంసలీలామహాదక్ష లక్ష్మీవిలాసోపభోగోద్భవానంద నారాయణా సంతతౌదార్యసౌందర్యచాతుర్యగాంభీర్యమాధుర్య సుస్థైర్యధైర్యార్జవౌజ్వల్యసౌశీల్యవాత్సల్యలావణ్యకారుణ్య సౌహార్దకా త్రజ్ఞశక్తిజ్ఞానవీర్యర్ధి తేజస్సమృద్ధ్యాదికానంతకళ్యాణ రాజద్గుణాంభోనిధీ శ్రీగరుత్మత్ భుజంగాదిరాట్పూత్రివత్యాత్మ నాథాదిసూరీంద్రలోకైకసంసేవ్య దేవా మహాభాగ సర్వేశ్వరా సున్ను మున్నీటిలో మీనరూపుండవై దూఱ రోషంబుతో సోమకున్ జంపి ప్రాబల్కులన్ బ్రోచి చరీతిన్, సురారుల్ సురల్ చేరి వారాశిదచ్చన్ గిరిన్ మున్గకుండన్ మహాకూర్మరూపుం

డవై కొండనుండాల్చి దైతేయులెల్లన్ మనోభ్రాంతులన్
దూలఁగన్ మోహినీవేషభాసుండవై సల్పి పీయూషమున్ బ్రీతి
బృందారకుల్ గ్రోలఁగా జేయుచందంబునన్, దొల్లి దుర్మా
ర్గుఁడౌ హేమనేత్రుండు నిన్నెంచకే ధారుణిన్ జాపఁగా జుట్టి
సంద్రమ్మునన్ ముంచ ఘోణిస్వరూపంబునన్ వానిమ్రందించి
భూదేవి లాలించు నోజన్ గుమారున్ హరిన్ గొల్వ రాదంచు
శాసించి బాధింపఁగా దద్గృహస్తంభగర్భోద్భవ శ్రీనృసింహుం
డవై భక్తవైరిన్ విదారించి ప్రహ్లాదునాహ్లాదమొందించు
మాడ్కిన్ మహాదాత వైరోచనిన్ గుజ్జువై చేరి మూఁడడ్గు
లన్ భూమియాచించి బ్రహ్మాండమున్నిండి దైత్యేశుఁ బాతాళ
మున్ జేర్చి స్వర్లోకపీఠిన్ బిడౌజున్ బ్రతిష్ఠించి రక్షించుభంగిన్
మహిన్ బ్రహ్మతేజమ్మునన్ భార్గవాఖ్యన్ విరాజిల్లి ముయ్యేడు
మాఱుల్ నృపాలావళిన్ శుద్ధమూఢాత్ములన్ దున్మి తద్రక్త
పూరంబులన్ దండ్రికిం దర్పణంబిచ్చి భూచక్రమున్ బ్రాహ్మణా
ధీనముం జేసి పొల్పొందులీలన్ ధరన్ రామచంద్రుండవై పుట్టి
భూపుత్రిఁ జేపట్టి ఘోరాటవిన్ మెట్టి పౌలస్త్యునిన్ గొట్టి సాకేత
పట్టంబునన్ భార్యతోఁ బట్టభద్రుండవై లోకసంరక్షణన్ సల్పి
ఖ్యాతిన్ బలాఢ్యుండవై రోఁకలిన్నాగలిందాల్చి దుష్టాత్ములన్
మోఁది తోడన్ యదుస్వామికృష్ణుండవై మందలో వల్లవీభోగ
లీలాసముల్లాసివై కంసచైద్యాదిదైత్యాంశబృందంబులన్ దున్మి

సాధుపరిజనన్ గాచునోజన్, జీవాత్ముండవై తారకాసురాదిరక్షోధిపాఖ్యాఖ్యులన్ ముగ్ధలన్ జేసి తచ్ఛిలములవాపి యుగాగ్రిము బాణాగ్రిముఙ్జేరి తద్భర్తలన్ దుగ్రించి యీరేడులోకమ్ములన్ రక్షణన్ సేయుమాడ్కిన్ కలిన్ దుష్టసంకీర్ణమై సంకులంబౌ జగంబున్ విలోకించి ధర్మంబునిల్పన్ దపన్యంబుఁదొరిక్కన్ దురగంబుపై నెక్కి పాణిన్ గృపాణంబు శోభిల్ల వీరుండవై కల్కిరూపుండవై ధర్మసంస్థాపనమ్మున్ విలాసంబుగాఁ బాప సంహారమున్ సాధుసంత్రాణమున్ సల్పులీలన్ నిరాఘాతమౌ నీదువాత్సల్యమేపార బాలాపరాధంబులన్ దల్లిఁ దాలెన్ మదీయాపచారంబులన్ భోగ్యముల్గాఁగ టాక్షించుచున్ వేగ నేడెట్టులోయొక్కయట్టుల్ మదంఘ్రిద్వయింబట్టెడున్ వీఁడు నావాఁడటంచున్ ననున్ దేవ నీపాదదాసానుదాసున్ గరిన్ గాచురీతిన్ ధ్రువుంబ్రోచుపోల్కిన్ గృపన్ బ్రాపదీమాన సంరక్షణన్ సల్పినట్టుల్ దయాదృష్టి వీక్షించి రక్షింపు మోస్వామి శ్రీకాకుళేశా తటిద్వర్ణ ప్రకాశా హృదంతర్నివేశా నతవ్యోమకేశా నమత్పావనాశా విభూతిద్వయేశా యనాశా రమేశా నమస్తే నమస్తే నమః.

కం. ప్రార్థనమిటు సల్పఁగ నా
ప్రార్థన విని దయ పిలంగఁ బాలునిభక్తిన్
సార్థము సేయ ధరించెను
బార్థునిచెలికాఁడు కురులఁబడపడిమాలిన్

పరమదయాపరుల్ సురలు పాలనఁజేతురు దీనులౌచు డ
గ్గరుశరశార్దులన్ విభుఁడుగావఁడె తన్నె మనమ్మనన్ నిరం
తరము నుతించు బ్రాహ్మణుని దండనఁజేయునె చిన్నితప్పుకై
హరి శరణాగతావనుఁడు నాశ్రితవత్సలుఁడౌటెఱుంగమే.

గీ. తనదుప్రార్థనమన్నించి ధరణినాథు
దండనముమాన్పి హరి తన్ను నిండుదయను
బ్రోచినట్టుల యుల్లముప్పొంగుచుండ
విప్రవర్యుఁడు గన్గవ విప్పి యెదుట.

స. తేనెకై పిరిదమ్మి నానవేతెంచెడి
యళిపాళులన మనోహరతరములు
ఇంద్రనీలంబుల రుంద్రనీలాంబుద
ములఁబోలె నీలమంజులతమములు
పద్మాలయాకరాబ్జాతదత్త సుతైల
శోధనసుమబంధశోభితములు
నిండుచందురువెన్క నిండియుండెడునంధ
కారమొనాఁగఁ బ్రకాశితములు

గీ. నగుచుఁగేశపుఁడనుకీర్తి జగతిఁదనకుఁ
గూర్పఁజాలినయందాపుఁగురుల ఫాల
తలమునకు వెన్క హరి తలఁదాల్పఁగాంచి
యుబ్బి సంతసంబున విప్రుఁడుత్సహించె.

ఎదలో మోదముచిందుద్రొక్కఁగన సర్వేశాంఘ్రులన్ వీడి న
మ్రదిగా వెన్కకు నేగి కేశముల బ్రేమన్ బున్కి మూర్కొంచు నిం
పొదవన్ గన్నులనద్దికొంచు నిజబాహాల్ సాచి ప్రార్థించు వే
పదపద్మమ్ముల వ్రాలి లేచు క్షితిగీర్వాణుండు పల్మారులన్.

కం. ఈవిధి భక్త్యావేశము
తో విప్రుఁడు గొంతవట్టు తోయజనాభున్
భావితమతియై గనఁగొని
యావల స్థితిగతులెఱింగి యంతట మరలన్.

గీ. ఒత్తుగా మెత్తగాఁ బట్టునోజఁ దనరు
నాంధ్రనాథుశిరోజములవనిసురుఁడు
పాయలుగఁ జేసి దువ్వి సంబరముతోడ
జారుసిగ వైచి పూసరుల్ చాలఁ జుట్టి.

గీ. వింత వింతలరంగుల పిరియఁబూచి
పరిమళమ్ముల విరజిమ్ము ప్రసవరాజి
నాభరణముల భాసించు హరిశిరమున
నందముగఁ బెట్టి సిక పైని యంతనతఁడు.

భక్తిన్ వచ్చుడి భక్తులెల్లరును శ్రీవత్సాంకునల్కాల్ మహా
శక్తిన్ గాంచెడు భాతి దర్పణమునా సర్వేశు వెన్కన్ మహా
యుక్తిన్ గోడనమర్చి భూసురుఁడు హర్షోత్సాహముల్ పొంగ స
ద్భక్తిన్ స్వామినిఁ గాంచరండనుచు వార్తన్ బంపె రాష్ట్రీలకున్

యాజకుఁడంపువార్తవినినంతన రాత్రియలంతులేని ని
ర్వ్యాజపుభక్తివైష్ణవునియందు నెసంగఁగ నాత్మభర్తతో
యాజకురీతిఁదెల్ప నతఁడచ్చెరువందుచు నట్టులయ్యె నేన్
బూజకుఁగూడవేళయిదె పోదము విష్ణుశిరోజముల్ గనన్.

కం. అని యనుమతించి తనపరి
జనసచివసుపుత్రమిత్రజాయలతోడన్
ఘనమగునుత్సాహముతోఁ
జనియెన్ శుచియౌచుఁ దెనుగుసామినిఁగాంచన్

పౌర యిదెట్టివింత దనుజారికిఁ గేశములున్నవంచుఁ బూ
ర్వాంర వచించెనంట గన సత్వర నేగ న రేంద్రుఁడంచు నా
యూర మెలంగుపౌరవరునొక్కరిలొక్కరిఁజేరి పల్కుచున్
నారసనాభుసన్నిధికి శౌరిశిఖన్ గననేగిరయ్యెడన్.

కం. సందడిసేయక వెంట న
మందగతిన్ వచ్చు ప్రజల మనుజేశుండా
నందమునఁ గనుంగొని గుడి
ముందఱ శ్రీహరికిఁ గేలు మోడ్చుచు నిలువన్

హరికైంకర్యపరుల్ ధరాధిపుఁడు రా నల్లంతనె కాంచి యం
దఱు సంరంభముతో నెదుర్కొనుడుఁ బీతస్వాంతుఁడై వారిహా
సరుచుల్ మోమునఁబర్వ మెచ్చుచుఁజనెన్ సర్వేశ్వరుంగాంచ సు
స్థిరభక్తిన్ వలగొంచు లోపలికిఁ బృథ్వీనాథుఁడుత్కంఠమై.

పరిపూర్ణచంద్రునిఁ బరిహాసించెడి మోము
నందునఁ జిఱునవ్వు చిందువానిఁ
బుండరీకమ్ముల దండించుకన్నులఁ
గరుణారసస్ఫూర్తి పరగువాని
శ్రీవత్సకౌస్తుభశ్రీతులసీవనమాల
లన్ బ్రకాశించునురమ్మువాని
శంఖ చక్ర గదాబ్జసహితహస్తములతో
నభయప్రదుండౌచు నమరువాని

క. హారకేయూరమణికిరీటాదిభూష
ణాంబరోజ్జ్వలు నాంధ్రనాయకునిఁ గనల
కలువపూల్ సకుటుంబుఁడై కాంచి భక్తిఁ
బ్రణతులర్పించి లేచి భూపాలుఁడప్పుడు

గీ. కాంతమణిభూషణంబులఁగ్రాలు దాని
సురభిసుమదామబద్ధమై వరలు దాని
దర్పణప్రతిఫలితమై తనరుదాని
నరసె హారిశిఖ మదియందు నరుసమొఁగ.

గీ. అచ్యుతుని యుత్తమాంగమునందు వెలయు
నీలశైవాలములనేలు నళుల మరల
మరలఁగాంచుచు సద్గురావరుఁడు హృదినిఁ
దలఁచె నీరీతినాంధ్రశుకేలన నిలచి

ఎచ్చటనేని యిద్ధరణి నీగతి దైవతమూర్తిమాళిపై
ముచ్చటగొల్పు వెంగ్రుకల మున్గనుగొంటిమె లేక వింటిమే
యిచ్చటఁదవ్వఁగాంచ నిపుడిందున సందియమేదొ డెందమున్
ొచ్చుచు నాక్రమించెఁ బరిశోధన సల్ప నిజంబు దేశికిన్

కం హరిభక్తులఁ బరీక్షించిన
హరికింబరమాపచారమగునని మదిలో
నరసియు వైష్ణవుఁగనుఁగొని
ధరణీశ్వరుఁడనెఁ బూర్వసంచితము వెంటాడన్.

భూసురవర్య చూడఁగ నపూర్వము వింతగఁదోఁచుచున్న నీ
భాసుర శౌరి కేశములఁ బల్మరు గాంచితి సంతసించితిన్
వాసియెగాని కొంచుప్రతివారలు నమ్మ పరీక్షసేసెదిన్
మాసచివుండు దీరునను మానము సమ్మతియౌనె మీకిటన్

గీ స్వామిని స్పృశింప నెట్లంచు సందియమ్ము
వలదు సంప్రోక్షణాదికమ్ములకు వలయు
సొమ్ము మీరలు మాబొక్కసమ్మునుండి
గొంచు సర్వము నిటజరిపింపవచ్చు.

నా విని భూసురుండు నరనాథుని మ్రోల వినమ్రుఁడౌచు
భూవర తెల్ప దీనశ్రితపోషణు కేశకథావిధానమున్
నావిమలప్రవర్తన ఘనంబగ శాశ్వతమౌను ధారుణిన్
గావునఁ గాంచుఁడిచ్చమెయిఁ గ్రన్నన కేశవకేశపాశమున్

కం. అని నిశ్చింతగ నాంధ్రే
శుని నతియించుచు విశుద్ధమూర్తులతో నా
మునినాధనిభుఁడు నిలచిన
మనుజేశుని యాన విప్రమంత్రియు నంతన్.

గీ. స్వామి మన్నింపు సకలాపచారమనుచు
నెఱఁగి సాష్టాంగముగ హరిచరణములకుఁ
గమలనాభుని పాదపద్మములు మొదలు
శిరము పర్యంతముగుఁ బరీక్షింపఁదొడఁగె

భాసురహీరముఖ్యమణిభాసితచారుకిరీటమున్ సునా
యాసత డించి వేగ జలజాక్షుశిరోజములన్ గరమ్ములన్
దోసమటంచు నెంచకెగఁదోసి కనుంగొని యంతఁబోక యా
భూసురమంత్రి లాగె నవపుష్పవిభూషితమైన వెండ్రుకన్

కం. ఇటులొంటి రెండు వెండ్రుక
లటునిటుగని పుటుకుపుటుకు మనిలాగ వడిన్
బొటబొట నెత్తుటిచుక్కలుం
తటుకున హరిశిరమునుండి ధారుణిఁ బడియెన్.

దివ్యసుగంధవర్ణమయదీప్తములైన యసృక్ప్రపత్తులా
మవ్యయుమౌళినుండి పడినంత భయంబున వ్యాకులాత్ములై
సవ్యమిదేమియంచు నరనాయకముఖ్యులు గాంచులోన దై
వవ్యతిరిక్తతన్ గనులు స్వప్నగతార్థములయ్యె వారికిన్.

ఆ. వె. కన్నులట్టుపోవఁ గళవళపడుచుఁ దాఁ
జేసినట్టిపనికిఁ జెందెఁగీడ
టాచు నెంచి యాత్మ నారాటపడుచు భూ
పాలుఁడాంధ్రనాథు మ్రోల నిలచి.

కం. ప్రజ్ఞాఢ్యుఁడట్టులకటా
యజ్ఞానముపొదువ మంత్రినంపి పరీక్షన్
విజ్ఞానమయ యొనర్చితి
నజ్ఞానాంధుండఁ గావుమాంధ్రాధిపతీ.

కావరమెక్కి కన్నుఁగవ గానఁగలేక మహాపరాధినై
యీవిధి సల్పినాఁడ జగదీశ పరాత్పర నిగ్రహింపకే
ప్రోవుము భక్తవత్సల విభో కరుణామతి నాంధ్రరాజ్యల
క్ష్మీవర మ్రొక్కువాఁడ నినుమించెడునాప్తులు లేరు నాకిఁకన్.

కం. కలికలుషదూరు నిన్నుం
దెలియక యిటుతప్పఁ జేసితిన్ దండ్రీ నా
కలుషము లెంచక నయనం
బులదృష్టినొసంగుమయ్య బుధమందారా.

పాపుఁడ నేను నీవో యఘభంజనమూర్తివి ఘోరదుఃఖసం
తాపుఁడ నేను దుఃఖపరితాపవిదూరుఁడవీవు గాన నీ
వే పరిరక్షసేయఁదగు విశ్రుతసంశ్రితరక్షణవ్రతా
నీపదపద్మముల్గనక నిల్వఁగఁజాలఁ దెలుంగుదేవరా.

కం. అని యిటువలు దెఱఁగులఁ బ్రా
ర్థనసల్పుచు స్వామియడుగుఁదమ్ముల వ్రాలన్
గని శ్రీకాకుళనాథుం
డనియెన్ ఘనరవఘనంబులగుభాషలతోన్

ధరణీనాథ భవత్ప్రమోదమునకై ధాత్రీసురుండయ్యె మం
త్రిరి నాభక్తునిధిక్కరించి మదినెంతే భీతివోనాడి నా
కురులంబట్టి పరీక్షసేసి యిటులన్ ఘోరక్రియల్ సల్పెద
ద్దురితాసంగముసేసికల్గెడిని యీదుఃఖంబు మీకియ్యెడన్.

గీ. భాగవతులను నీరీతిఁబరిభవించి
నన్ను వేఁడిన ఫలమిల మన్న యగును
భక్తబాధుఁడ నేను నాభక్తుఁ డీతఁడు
గాన నీతని వేఁడుఁడు గల్గు సుఖము

అని యాంధ్రేశ్వరు డాడ మానవవిభుండత్యంత మోదమ్మునన్
అని ధాత్రీసురునంఘ్రిలన్ వినతుఁడై విప్రార్య నాదుర్ణయం
బును మన్నించి మమున్ గృపారసమునన్ బ్రోవంగదే నాత్రి స
ష్టనవర్యంఋసహింపరాని దెది యజ్ఞానాంధు నన్ సైపుమా

అని తను వేడు జేనిఁ గరుణామతి లేవఁగనెత్తి భూసురుం
డనిమిషమౌళిరత్నకిరణావళిరంజితమై తనర్చు శ్రీ
గునిచరణాబ్జయుగ్మమున శుద్ధమనమ్మున వ్రాలి యీక్రియన్
నుతి చ్చె నాంధ్రవిభుఁ బేర్కొని పేరిమిఁ బెక్కు రీతులన్.

కం. దేవా నీదగుతత్త్వము
భావాతీతముగదయ్య పరికింపంగా
నావంటి వానికగునే
యీవే విశ్వమయుఁడవనియెంతు ముకుందా.

ఆ. వె. చిన్నదనమునుండి నిన్ను కొల్చితిఁగాని
యీవుమాటలాడు టెఱుఁగ నేను
పుడమియొడయఁడెంత పుణ్యాత్ముఁడీతని
వలన మీదు తెయ్యపలుకువింటి.

సకలచరాచరమ్ములను సాకు నియంతవు దేవ నన్నిటన్
సకరుణఁగాంచి మీదు పదసారసభక్తినొసంగి ప్రోచిన
న్గలుషమూర్తియీన్నపునియంతఁ బాపుము శ్రీమదాంధ్రనా
యక దురితాపహారక శ్రితార్తినివారక దేవ మ్రొక్కెదన్.

చేతనులెన్ని తప్పలను జేసిన సర్వముసైచి వారి సం
ప్రీతినిఁబ్రోచుతండ్రివిటు ప్రేముడి వీడిన నెవ్వరింక నీ
భూతలమందుబ్రోచెదరు ప్రోవుమ నేరక చిన్నతప్పిదం
బీతఁడు సల్పె దానికయి యీవిధి శిక్షవిధింప న్యాయమే

ఆ. వె. చిన్నతనమందునజ్ఞులై కన్నవారు
కూర్మి విడనాడి కలహింపఁ గూర్చి వారి
తగవులన్ దీర్చి తయఁజూడఁ దగును గాని
కఠిన శిక్ష విధింతురే కన్నవారు.

కం. వలసినవన్నియు నిలలోఁ
గలిగె భవత్కరుణ నింకఁ గారుణ్యసుధన్
జిలుకుచు నీరాజాస్యయు
మిలవర్థిలఁ జేయుమిందిరేశ మురారీ.

ఈవిధి వేద భూసురుఁడహీనశయానకృపారసమ్మునన్
భూవరతత్సతీసచివపుత్రిలనేత్రములర్కరాకఁ గం
జావళి యుల్లసిల్లినటులందెను జూడ్కుల దొంటిరీతి ల
క్ష్మీవరుఁ డుల్లమందుఁ గృపసేయ సుఖంబులు దుర్లభంబులే.

ఇటుల బ్రాహ్మణకృపౌషధమ్మునను వారెంతే వడిన్ దృష్టిసం
ఘటనన్ భేదలు పెన్నిధింగనినచందానన్ బ్రహృష్టాత్ములై
స్ఫుటవర్షా మాధవభక్తవత్సలతకున్ జోద్యంబునన్ జెంది యు
త్కటభక్తిన్ భగవానునిన్ మఱియుఁ దద్భక్తున్ బ్రశంసించుచున్

సీ. వజ్రవైఢూర్యముల్ వలనొప్పఁ దాపిన
మేలిమి నగల దుకూలములను
జవసత్త్వసంపద సరవినొండొంటిని
నవలఁబొమ్మనఁ జాలు వారువఁ గముల
ఫలపుష్పముల సతంబలరారు తోటల
నందముల్ చిందు పణ్యాంగనలను
దక్కవగాకుండ ముక్కారుపంటలఁ
గ్రాలు భూముల నొప్పగ్రామములను

గీ. బాడిమొదవులు నరదముల్ భర్మసౌధ
పంక్తులతులితహేమమ్ము పౌరులంద
అబ్బురంబంద నాంధ్రనాయకునకిచ్చె
జన్మధన్యతనంద నాజనవరుండు.

ధనములు పట్టుపుట్టములు ధాన్యములున్ మడిమాన్యముల్ మహా
ఘనత వహించు రత్నములు కామగవిన్ దలపించు గోవులిం
పెనయు విశాలవాటికలు నెత్తగుసౌధములర్చసల్పి వి
ప్రునకు నొసంగె భూధవుఁడు పొంగుచు నెంచఁగరాని భక్తితోన్

కం. భగవద్భాగవతార్చన
లోగినిఁబలోనరించి పుడమియొడయఁడు ధర్మం
బుగ నగణితవైభవముల
జగతిన్ బాలించె సర్వజనము నుతింపన్.

ధరణిపుఁడిచ్చుకానుకల యథావిధిఁగైకొని యర్చకుండు శ్రీ
హరిపదభక్తిఁ బాయక యహర్నిశమున్ సతిఁగూడి వేడుకల్
వఱఁగఁగుటుంబియై యతిథిభాగవతార్చన వీడకుండ ని
ద్ధరణిఁ జరించె వారవనితామణి చేతము సంతసింపఁగన్.

మంగళమాంధ్రవిష్ణునకు మంగళమాతని దేవికిన్ సదా
మంగళమాజగద్విభుల మానక కొల్చెడి భక్తపాళికిన్
మంగళమీకసత్కృతికి మంగళమీశుభకావ్యకర్త్రికిన్
మంగళమీకృతిన్ జదువుమాన్యులకున్ విను ధన్యకోటికిన్

సీ. కరుణారసస్ఫూర్తి గడకన్నులను గ్రాలఁ
జిఱునవ్వు మోముపైఁ జెలఁగువాఁడు
హారకోటీరకేయూరకౌస్తుభరత్న
కుండలభూషుఁడై గులుకువాఁడు
వరవారిజరథాంగవరదముద్రలు దాల్చి
యాజానుబాహుఁడై యలరువాఁడు
వక్షస్థలంబున వనమాల కటితట
మ్మున హేమవసనమ్ము దగువాఁడు

గీ. పెక్కుసూర్యులకంటె సొంపెక్కు తేజ
మలర శతమన్మథాకారుఁడైన శ్రీని
వాసుఁడిక్కావ్యమేవేళ వాసికోడ
నిలను వర్ధిలఁగ ననుగ్రహించుఁగాత

ఇది శేషాచలరాట్కృపాత్తకవితాహేలాసముల్లాససం
పద విశ్రాలక్షలీనశేషకవిరాణ్ణాళిద్వితీయాపదా
స్పద శ్రీదేవియొనర్చి యాఫణిగిరీట్పాదంబులంగాంచ నా
భ్యుదయంబౌ రసికప్రపత్తికృతియన్ పూవిచ్చు సమోన్నదమున

* * పుష్పమాలికాబంధము * *

పరదరకారకా భువనవద్వ్యవగా దరధారణా రమా
వర మురమారకా విభవభవ్యభవాసురవారధీరభూ
ధరధరధారకా సదయదన్నిదరావహా శ్రీహరి హరీ
శ్వర వరదా రసజ్ఞ వరవర్య వరమ్ముల నేలవేలరా.

- గద్య -

ఇది శ్రీ వేంకటేశ్వర వరప్రసాద సమాసాదిత సరస కవితా
విలాస పాత్రి భారద్వాజగోత్రి పిక్రాల శేషాచార్య
కపివర్య కళత్రి, పర్ణశాల రంగమన్నారాచార్య
శేషాంబాగర్భసంభవ శ్రీ దేవీ విరచి-
తంబైన "రసికశరణాగతి" యను
నిర్వచనశృంగార ప్రబంధంబు
సర్వంబు సంపూర్ణంబు.

